

dandeda poetry by
ponnala balaiah

'దండెడ' బహుపురుల అల్లిక. బలమైన సాధనం. గట్టిదనం, పట్టుదలల ప్రతీక. పొన్నాల బాలయ్య సంకల్పం దృఢమైంది, గాఢమైంది. దండెడ పాతాళంలోంచి నీళ్లెట్ల తోడేదాకా వదులదో, బాలయ్య జీవితం అడుగు నుంచి కవిత్వం తోడేదాకా నిద్రపోడు. నిద్రపోనివ్వడు. మేలుకొన్న వాళ్ల ప్రపంచమే కవిత్వం.
**జీవితం గెలవాలె, కవిత్వం బతుకాలె.**

-డా.నందిని సిధారెడ్డి

గతితార్కిక వెలుగులో నేను పొన్నాల బాలన్న కవిత్వాన్ని ముని వేళ్ళతో ముద్దాడుతున్నాను. ఎండిన పెదవులను పదును చేసుకుంటున్నాను. కనురెప్పలపై నాలుగు దీపాలను వెలిగించుకుంటున్నాను. చూరు సందులో నుంచి మసకగా పొడుస్తున్న సూర్యునిపై చిందేస్తున్నాను. దండెం మీద ఆరేసిన ఎండు తునకల రుచిని ఆస్వాదిస్తున్నాను. మరణించిన ప్రతిసారి సూర్యునిపై ఉదయిస్తున్న మనుషుల్ని చూస్తున్నాను. చార్వాకుని సమాధి నుంచి లేస్తున్న అక్షరాలను వీక్షిస్తున్నాను. తడిసి ముద్దయిన గుండెల నుంచి కారుతున్న బురదలో నాలుగు కన్నీటి బొట్లు రాల్చుతున్నాను. ఆకాశానికి కాసిన స్వప్నాలు గోగుపువ్వులా రాలిపోతున్న విషాద కాలానికి కావలి కాస్తున్నాను. నిండుకుండలా విచ్చుకుపోయిన చూలాలి కడసారి కన్నీటిబొట్టును కలగంటున్నాను. లందలో పొడుస్తున్న మనిషిని గుండెకు హత్తుకుంటున్నాను. గిరాయిపల్లిలో కాలిపోయిన పచ్చని కలలను గుర్తుచేసుకుంటున్నాను. కలం పెదాల మీద నుంచి జారిపోయిన కొమ్రన్న, బాలగోపాల్, కన్నాబిరాన్ జ్ఞాపకాలతో తడిసి ముద్దవుతున్నాను.
**ఇది బాలన్న కవిత్వానికుండే బలం. ఆర్ద్రత. శిల్పనైపుణ్యం.**

– డా.సి.కాశీం

దండెడ • పొన్నాల బాలయ్య

# దండెడ

కవిత్వం



పొన్నాల బాలయ్య

పొన్నాల బాలయ్య

# దండెడ



మంజీరా రచయితల సంఘం

# DANDEDA

## PONNALA BALAIAH

Collection of Poems

First Edition : July 2011

Copies : 1000

₹ 50/-

Cover Photo Art
**Gone Navitha Lingaraju**

Cover Design
**Ramanajivi**

Published by
**Manjeera Rachayethala Sangam**

Poet Address :
**Ponnala Balaiah**
Village : Arepally
Post : Baswapur.
Mandal : Koheda
Dist. : Karimanagar - 505 473.
Cell : 9908906248

Copies available at :
**Visalandhra Book House,** Hyd. and its branches in A.P.
**Navodaya Book House,** Badichowdi, Hyderabad.
**Disa Pustaka Kendram,** Chikkadapally, Hyderabad.
**Sahachara Book House,** Baghlingampally, Hyderabad.
**Prajasakthi Book House,** Chikkadapally, Hyderabad.

Printed at :
**Karshak Art Printers**
40-APHB, Vidyanagar, Hyderabad.
Ph : 040-27618261



తెలంగాణ పోరాటంలో
గోగుపువ్వుల రథచక్రాలై
ఆకాశంలో దీపాలైన అమరులకు......

# మట్టికండ్ల ఉసికె సప్నాల ఎతల నుంచి...

"ఎగిలివారంగ"తో సాహితీలోకానికచ్చి, తప్పటడ్గులు, తండ్లాటల్ల, తలెత్తుకొని ఈ "దందెడ"ను మోసుకొస్తున్న....

నా చిన్నతనంల... మాకు శాతలుండె... శాతలంటె పటేండ్లకు, తాడు, తల్గులిచ్చి, చెప్పులుముడ్సి, ఆరుగాలం ఆల్లభూముల్ల ఆల్లకె పనికిపోవుడు. కైకిలిలేదు, కూలిలేదు. పంటపండినంక వాళ్లు ఎంత బిచ్చంపెడితె అంతె. కల్లమడ్గులు వుడ్సుకోవాలే గంతె. ఆ కట్టం అంతయింత గాదు! కడుపునిండది, కట్టందీరది! నా చిన్నప్పుడే మా అయ్య కాలంజేసిండు. అన్న జీతముండె అవ్వ శాతలు జేత్తండె! నాకు ఊహ తెల్సెనాటికి కట్టాలెచుట్టాలు! మా అవ్వ వాళ్లను వీళ్లను బతిమాలి తాడు తల్గు పేనిచ్చేది. చెప్పులు కుట్టిచ్చేది. మా అన్న జెర బుద్దెర్గినంక ఈతకమ్మ కోసి నార జీరి కట్టలుగట్టి మెల్లె మెల్లెగా తాడు పేనుతాంటె నేను తాడు పురి ఏసేది. గప్పుడె మతిల మాటలు అల్లుకునేటోన్ని! దందెడ పేనుడంటే ఏంది? ఎంత దొడ్డుకావలంటె అన్ని పురులు కల్పి ఒక్క దగ్గర అల్లాలే. దందెడ పేనుడు అందరికి రాదు. అదొక ప్రత్యేకమైన కళ, అనుభవం. నైపుణ్యం వున్న ముసలోల్లే నేసేది. పురిగట్టిగా తాల్వకపోతే దందెడకు బలం వుండది. జెల్ది తెగిపోతది, ఏడికాడికి ఇచ్చుకపోతది. నాలుగైదు జోడిలు పొద్దీకి సురువైతే తెల్లంగ తెల్లారెదాక పేనేది. పేనిన దందెడను మోట బొక్కెనకుకట్టి తొండపుతాడు, చేతిలపట్టి, ఎడ్లకు కానీ అంటగట్టి మోటగొడితె గిరుకమీద తాడు తిరిగి భూమికి వొర్సుకపోకుంట కదురుక ఆపేది. బొజర్లనీళ్లు పోయించేది. మోటనడ్వకపోతే పొలం పారకపోవు, ఎండిపోవుడె. అప్పుడు మా అన్నకు సద్ది తీసుకపోయేది. మోటకొట్టేది, ఎడ్లు బారిలకు దిగుతంటె, ఊం చల్ చల్ ఎక్కుతంటె ఊం శెరి శెరి దందెడమీద బోర్లబొక్కల పండేది. పాటలుపాడేది, ఆటలు ఆడేది. దందెడ బాయిల నీల్లుతోడే సాధనం, రథంను లాగుటానికి, దొడ్డు-దొడ్డు మొద్దుల రాళ్లు మోసుటానికి వాడేది. నార పోచలేకమై కరితిర్గి దందెడ అయ్యింది. దొబ్బలు వణకె చలైన కటికె న్యాతిరైన సుక్కలన్ని ఒక్కటై ఆ కట్టానికి కాంతినిచ్చెది. కార్జాల చాటున దాసుకున్న పేదరికం ఆనాటి నుంచి ఈనాటిదాక అణచబడ్డ ఆత్మగౌరవం. నవ్వుతూ... ఏడుస్తూ... ఏడుస్తూ... నవ్వుతూ... ఏడుస్తూ... మూగ రోదనాలతో మూల్గె మట్టి మషాణాన్ని నమ్ముకొనే మట్టికండ్లల ఇసుక స్వప్నాల ఎతలే ఈ కవిత్వం. దందెడ ఐక్యతకు, వీపానిచ్చి దీరదీస్కొన కట్టానికి గుర్తు. అందుకేనా నా ఈ రెండో పుస్తకానికి దందెడ పేరుపెట్టిన. ఇగ కవిత్వాన్ని తోడుకోండ్రి.

మోటకొమిరెల మీద గిరుకై దందెడపురి తెగకుంట కదురుకై మోటకానీ మెడమీదకట్టి



మోటగొట్టించే కరెక్కిన ముందుమాట రాసిన గురువు డా॥నందిని సిధారెడ్డి గార్కి,

చిట్లిన గుండె నాళాల్ని నారపోచలతో తాడుపేని, మోటబొక్కెన తొండం నిండా కాయి పాయిలేని కట్టాన్ని ముందు మాటలో కాల్వలు పారించిన అన్న డా॥ కాశీం గార్కి,

పల్గిన కుదురుకు మరిగిన రక్తాన్ని అంబలిపూసి గాట్లుపడ్డ తోలుతోటి దప్పుమూసి సాహితీ సావడీల కలంతో నిప్పుల ధర్వేస్తున్న.. దోస్తులు వేముల ఎల్లయ్య, కదిరె కృష్ణ, గోగు శ్యామల, జూపాక సుభద్ర, కృపాకర్ మాదిగ, అంబటి వెంకన్న, సిద్దెంకి యాదగిరి, దానక్క ఉదయభాను, గుడిపల్లి రవి గార్లకు,

న్యాల మూల్గుల సల సల కాగే అవమానాల్ని వలస దోపిడిని కరవాలితో కతమ్ చేయ అస్తిత్వ జెండా ఎగరేస్తున్న జూకంటి జగన్నాథం, జూలూరి గౌరీశంకర్, నలిమెల భాస్కర్, అన్నవరం దేవేందర్, సుంకర రమేష్, వేణు సంకోజు, మద్దికుంట లక్ష్మణ్ గార్లకు కరీంనగర్ జిల్లా తెరవే మిత్రులు మరియు సాహితీగౌతమి మిత్రులు, తెలంగాణ జనజాగృతి, ఆత్మబంధు మిత్రులందరికి,

ఎండిన ఆకాశంలో సింగిడి పూయించి న్యాల తల్లి ఎతలను ఎదలకెత్తు కుంటున్న సోపతిగాల్లు జిలుకర శ్రీనివాస్, స్కైబాబ, పసునూరి రవీందర్, అన్వర్, షాజహాన, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, సంగిశెట్టి శ్రీనివాస్ గార్లకు,

అమూల్య సలహాదార్లు డా॥ గుండె డప్పు కనుకయ్య, డా॥దార్ల వెంకటేశ్వర రావు, డా॥ జి.వి. రత్నాకర్, డా॥ భీమయ్య, డా॥ పురుషోత్తమ్, డా॥ వీరన్న నాయక్, గీతారామస్వామి, దర్భశయనం శ్రీనివాసచార్య, బండి నారాయణ స్వామి, డా॥ రాధేయ, ఎన్. వేణుగోపాల్, వరవరరావు, పాణి గార్లకు, విరసం మిత్రులకు,

"మోటబోజర్ల తోటి దాపటిభుజం" అన్న తైదల అంజయ్యగార్కి, అన్నపడ్డ కలానికి ఆత్మవిశ్వాసం నింపి పునర్జీవింపజేసిన అన్న చైతన్య ప్రకాశ్ గార్కి,

మంజీర రచయిత సంఘం మిత్రులందరికీ...

నా కవితలు ప్రచురించిన ఆంధ్రజ్యోతి, నమస్తే తెలంగాణ, వార్త, ఈనాడు, సూర్య, నేటినిజం, దళితవాయిస్, ప్రజాసాహితి, సాహిత్య ప్రస్థానం, అరుణతార, వీరతెలంగాణ సంపాదకులకు ధన్యవాదాలు...

అమ్మ, జమ్మిఆకు, మాదిగపొద్దు, కైతునకల దండెం, తెలంగాణ కవిత, జాగో, జగావో, వల్లుబండ, దిమ్మిస... పో... సంకలన కర్తలకు ధన్యవాదాలు...

ఉద్వేదనం చెందిన గుండె దిగుడులోకి మొకంపెట్టి ముఖచిత్రం గీసిన గోనె నవిత-లింగరాజు గారికి, కవిత్వం మీదిప్రేమతో ఓపికగా కవర్‌పేజ్ డిజైన్ చేసిన రమణజివి, డి.టి.పి. సంతోష్, ఫోటో గ్రాఫర్ మహేందర్ గార్లకు, అందంగా పుస్తకాన్ని ముద్రించిన కర్షక్ ప్రింటర్స్‌కు కృతజ్ఞతలు...

ఆత్మీయ శ్రేయోభిలాషులు కేడం సరిత-లింగమూర్తి సర్పంచ్ హుస్నాబాద్, పొన్నాల నవ్య-లక్ష్మణ్ ఎమ్.పి.పి. కోహెడ, గుమ్మడి రమేష్ వి.ఆర్.ఓ., ఉప్పులస్వామి సముద్రాల, కుసుంబ రాజు, లాసాని రాజు గార్లకు, పి.ఎస్. & జెడ్.పి.హెచ్.ఎస్. మైసంపల్లి ఉపాధ్యాయ బృందానికి ఆత్మీయ కృతజ్ఞతలు.

రాష్ట్రీయ ఉపాధ్యాయ పండిత పరిషత్ మిత్రులకు, స్కౌట్ మిత్రులకు... కవులు కళాకారులందరికీ...

పురిగల్పి దందెడను అల్లుకుపోతున్న నా జీవిత భాగస్వామి కృష్ణవేణి (ఉమ), కలలఊట కొడుకు అభినవ చైతన్య కుమార్‌కు...

నా పల్లెకు, ఊరుకు, మోయతుమ్మెదవాగుకు సోపతిగాళ్లకు, చుట్టాలకు, బడిపిల్లలకు, ఉపాధ్యాయులకు, శ్రేయోభిలాషులందరికీ....

నా ధన్యవాదాలు....

**- పొన్నాల బాలయ్య**



# మేలుకున్న వాళ్ల ప్రపంచమే కవిత్వం

డా॥ నందిని సిధారెడ్డి.

తెలుగు కవిత్వంలో తెలంగాణ పరిమళాలు వీస్తున్నాయి. మట్టిపొత్తిళ్లలోంచి పుట్టిన మాటలు మనసు పొరలను తాకుతున్నాయి. విషాదం, ఆనందం, ప్రేమ వంటి సర్వజన జీవానుభూతులకు ప్రాంతీయ, స్వీయ ముద్రలుంటయి. అవి పుప్పొడిలా అంటందే కళకు పూర్ణత్వం రాదని తేలిపొయింది. కొత్త గుర్తింపుతో సరికొత్త శబ్ద సమ్మేళనంగా, స్థానిక ప్రతీకల పరంపరగా కవిత్వం కొత్త సోయగాలు సంతరించుకొంటున్నది. భావానికి ఆవేశాన్ని కూర్చి ఆకట్టుకునేది బలమైన మాటల పొందికే. తిక్కన చెప్పిన పలుకుల పొందు దారిలో తెలంగాణ కవులు పలుకులను, పలుకుబడులను పొందించి కవిత్వాన్ని తీర్చి దిద్దుతున్నరు. ఏ కవి అయినా కవిత్వం చేదుకోవాల్సింది జీవితం నుంచే. ఎంత తోడినా ఒడవనిది జీవితం. తెలంగాణ జీవితం మరింత నిరంతర స్రవంతి. బహుముఖమైన, బహుకృతమైన తెలంగాణ అనుభవసంపదను తడితడిగా ఆవిష్కరిస్తున్నరు తెలంగాణ కవులు.

చెర్న కోలలై తెలంగాణ దరువేస్తున్న చిర్రల్ని పట్టిన వేళ్ళు పేనిన "దందెడ" చిత్రిస్తున్నడు పొన్నాల బాలయ్య. "ఎగిలివారంగ"నే మొదలైన బాలయ్య కవనసస్యానికి 'దందెడ' బొక్కెనపట్టి తడిపెడుతున్నడు. బాలయ్య సహజంగా ఆవేశపరుడు. జీవితం అదుగులోతులు చూసి, మునిగి అలమటించిన కవి. అక్షరంలో ఆర్ద్రత ఒలుకుతంది. అంతకంటే ఆవేశం పలుకుతంది. సాంద్రత అటీటయినా సహృదయాన్ని మెప్పిస్తది.

గుండుమీది గుండు దొంతులోని గుండెక్కి
గొంతు విప్పుకున్న నీలి మేఘం కుండపోత జ్ఞాపకాలు కుమ్మరిస్తది
మోయతుమ్మెద అలల మీద
మోదుగాకు పడవలో ఊహలు
పచ్చటి చెట్ల మీద స్మృతి పతంగులై రెపరెపలాడుతయి (వాగు-నేను-కల)

కుండపోతగా కురిసే జ్ఞాపకాల్లో తడిసి, మోదుగాకు పడవలో తేలి ఆర్ద్రంగా పలుకుతాడు కవి. తెగిన పతంగి చెట్టు కొమ్మల్లో చిక్కి చేస్తున్న సవ్వడి వినగలడుకవి. ఎంతో లలితంగా అనుభవాన్ని మలిచాడా.. అంతే నిశితంగా నిర్మోగమాటంగా మరో అనుభవాన్ని చిత్రించగలడు. అక్కడంతా ఆవేశమే. మాటలు పదునుదేరి వెలువడినయి.

కాల్చి పారేసిన బొక్కలే కదా
పదునెక్కిన ఆయుధాలయ్యేది

పలిగిపోయిన డొక్కలే కదా

పాటల దరువయ్యేది

పిరికోడు పీడనను సహిస్తూ జీవిస్తాడు
వీరుడు ఎదిరిచ్చి జీవిస్తాడు ... (పోరాట బిడ్డలు)

చెప్పదలుచుకున్నది దాచుకోడు. గుభిల్లుమన్నట్టు గుద్దినట్టు చెప్పేస్తడు. రచనలో ఉపయోగించే పదజాలం ద్వారా కవినేపథ్యాన్ని అందుకోవచ్చు. బాలయ్య కవిత్వం నిండా ఎక్కడికక్కడ తెలంగాణ దళితస్వరం స్పష్టంగా ప్రకటితమవుతుంది. ప్రతీ స్మృతి అచ్చమైన జీవన చిత్రం. యాది లేకపోతే జీవితానికీ, కవిత్వానికీ ఆస్వాద స్థాయి ఉండది. మననమే కదా మధురత్వం అయినా, అమరత్వం అయినా...

పుట్టెడు ఉసికె తెప్పల మీద
ఆరబోసిన అక్షరాలలో పొర్లితే

వొంటికంటిన పంచవర్ణ పాదముద్రలే

బతుకు పుస్తకం మీద తడితడిగ తగుల్తడు ... (వాగు-నేను-కల) .

వర్ణ వ్యవస్థను వాగును, ఇసుకను కూడా వదలడు. వొంటికంటిన వర్ణముద్ర ఎంత గాయపరుస్తుందో బాలయ్య అనుభవించిండు. ఆ గాయమే అతన్ని కవిగా మలిచింది. స్వరం సవరింపజేసింది. దళిత జీవితమంతా ఒక్కటి కాదు, గాయం నుంచి మరోగాయం, మాదిగ చైతన్యం, పోరాటం మరో కవితకు ఊపిరిపోసింది.

ఉమ్మడి హక్కులు వర్గీకరించుమంటే

కల్పుందమని కథలు చెప్తుతండ్రు

తాళం చెయ్యి ముడ్డికిందేస్కొని పొక్కలు తవ్వుతుండ్రు

తవ్వు-తవ్వు ఆఖరికి ఆ పొక్కల నువ్వే పడుతవు.

సందర్భమేదైనా హక్కుల సమస్య హక్కుల పోరాటం శతాబ్దాల పొడుగూత సాగుతున్నది. నిజమైన కవి ధర్మం వైపు నిలబడి కవిత్వం సృజించిండు. ఆర్ద్రమైన కవి బాధితుడి ఆక్రందనై అక్షరాలు పొందించిండు. వర్తమాన సమాజాన్ని కుదిపివేస్తున్న అస్తిత్వ ఉద్యమాలన్నీ హక్కుల కోణం నుంచి ఆవిర్భవించినవే. దళిత, స్త్రీ చైతన్యాలయినా, వర్గీకరణ, తెలంగాణ ఉద్యమాలయినా అన్నీ ఆత్మగౌరవ



ప్రకటనలే సమహక్కుసమరాలే.

బహుసంక్లిష్ట, బహుముఖ సమాజంలో ఒక వ్యక్తికి అనేక అస్తిత్వాలుండొచ్చు. కవి అనేక అస్తిత్వాలతో 'ఐడెంటిఫై' కావొచ్చు. ఏకకాలంలో ఒక కవి ప్రాంతీయ, కుల, లింగ, జాతి, మత అస్తిత్వాన్ని కలిగి ప్రేమించి స్వీకరించగలిగి ఉండవచ్చు. ఇది అస్తిత్వ ఉద్యమాల కాలం. నిత్యనూతనంగా వర్ధిల్లే కవిత్వ రుతువు. బాలయ్య కాలంతో రుతువుతో కార్తెతో కలిసి నడిచే కవి. దళిత, మాదిగ అస్తిత్వాన్ని స్వీకరించి కవిత్వీకరించిన విధంగానే తెలంగాణ అస్తిత్వాన్ని కవిత్వీకరిస్తున్నడు.

దించిపోసిన చంద్రదీపమోలె

బతుకే గుడ్డంగడయింది

నెరిగీల బడ్డసూపు

అలుకుపిడిసెల అట్టకట్టింది

తెలంగాణ తల్లి నుదుటరాసిన దుక్కం

గవ్వల కండ్లల్ల నిప్పురవ్వలు సిమ్మింది (నీ అయ్య జాగిరా)

నిజంగా తెలంగాణ తల్లిదంతా దుఃఖమే. శతాబ్దాల తరబడి అవమానాలు, యుద్ధాలు, మరణాలు, పోరాటాలు, బలిదానాలు ఎన్ని ? ఎన్నని ? ఎంత ఎంతెంత దుఃఖం ? వొడవని వొలపోత. తెలుగుతల్లి ఉత్సవాల్లో ఊరేగుతామంటే తెలంగాణ తల్లి నిత్యగాయాల నిలువెత్తు దుఃఖం. బాలయ్య తడిసిపోయిండు తల్లడిల్లిండు. తెలంగాణ బిడ్డల బతుకు గుడ్డంగడయింది అన్నడు. బతుకు అంగడవుటకు బాధంటే అది గుడ్డి అంగడయింది. సూపు నెరిగిలవడ్డది. గుడ్డి అంగడి చేసిన మాయగాండ్ల మీద కవికి ఆగ్రహం కలిగింది. గవ్వల కండ్లల్ల నిప్పురవ్వలు చిమ్మే ఆగ్రహాన్ని కవి చిత్రించిండు.

దోచుకునే వాండ్లు మాయా ప్రపంచం సృష్టిస్తరు. భాష ముందటేస్తరు. జాతి ముందటేస్తరు. తల్లి ఒకటంటరు. తమాషా ఏందంటే బతుకు ముచ్చట తియ్యరు. తియ్యనియ్యరు. మనం బలవంతంగ చర్చపెడితే వంకర మాట్లాడ్తరు. దోపిడి మాయ ఛేదించే వాడే కవి. వివక్ష పొరలు విప్పేసేవాడే కవి. స్వతంత్రం కోసం స్వరం సవరించే వాడే కవి.

నువ్వు భద్రమే
నీ భాష భద్రమే

భరోసా లేనిదల్లా మా బతుకులకే

బాలయ్య మాయను తునాతునకలు చేసిండు. భాష సెంటిమెంట్ భ్రమల్ని పటాపంచలు చేసిండు. భరోసా లేని బతుకుల సంగతి అడుగుతున్నడు. అన్యాయం మితిమీరితే యుద్ధం అనివార్యమన్నడు.

ఇది అన్నదమ్ముల లొల్లిగదరా
పకోడు గెట్టు చెడగొడితెనే పౌరుషమత్తది
ఇక్కడ బతుకులే చెడిపోయినయి
సూది మొనంత జాగియ్యనందునే
కురుక్షేత్ర యుద్ధం జరిగింది (స్పిరిట్ తగ్గిందా)

బతుకులు చెడిపోయిన తర్వాత తెగాయించుడే. రోషంతో రెచ్చిపోవుడే. కోపంతో కొట్లాడుడే. గతంలో యుద్ధాలెందుకు జర్గినయో ఇప్పటి యుద్ధం ఎట్ల జయిస్తదో ధ్వనిస్తున్నడు పొన్నాల బాలయ్య. దండెడ నిండా బాలయ్య సందడే. తెలంగాణ పద సంపద వరదై పారింది. తెలంగాణ ప్రతీక ఎక్కడికక్కడ పతాకలై ఎగురుతున్నయి. ఊరి వేపచెట్టు ఎండిపోయినా ఎవ్వరు కట్టారో నెత్తిన ఎగుర్తున్న జెండాను ఎత్తి పట్టుకుని వున్నదని ఉద్యమ చిత్రాన్ని ఆవిష్కరించిండు బాలయ్య.

ఆ బోధి వృక్షం ఒక్క సిద్దార్థునికే బుద్దినిచ్చింది
ఈ వేపచెట్టు మా వూరి పిల్లలందరికీ శిక్షణనిచ్చింది (ఎండిన వేపచెట్టు)

శిక్షణ పొందిన పిల్లలు ఉద్యోగాల్లో ఉన్నా, ఉద్యమాల్లో ఉన్న తెలంగాణ ప్రజల కొరకు ప్రత్యేక రాష్ట్రం కొరకు తుది సమరం సాగిస్తున్నరు. పోరులో హోరెత్తిన కొమ్రన్న, సురేందర్, ఉద్దంసింగ్, కన్నభిరన్‌ల స్మృతిలో కవి అక్షరాలు ఉడుకెత్తినయి.

బాలయ్య జీవితం అడుగులోతున మునిగి తెచ్చిన తెలంగాణ పలుకులు. పలుకుబడులు తన కవిత్వానికి జీవన పరిమళాన్ని అద్దినయి. సితపతాలం, కైరత్, కైలాట్కం, తీర్వాటం, పిడాప పదాలు, గోద కట్టం జేత్తె గోస వోసుకునుడు, సాటుకు తవుడంటక పోవుడు, ఓపికున్నోన్ని ఓరకుంచుడు, వంటి పలుకుబడులు సారవంతమై సౌందర్యవంతమైనయి.

కొన్నిచోట్ల కవిత్వ పాదాలు ఊహకు నిదర్శనాలుగా, ఉన్నతీకరణను ఉదాహరణలుగా వ్యక్తీకరణ పొందినయి. భూమాత నుదిటిమీద దస్కత్ చేసిన పాదం, చిచ్చుబుడ్డి దుక్కం పూవు పూసింది, బతుకు దిగుడుకు తుట్టెగట్టిన దరిద్రం, గుడిసె గోడకు గుండె బాదుకొని పాతదప్పు పలిగిపోయింది వంటి అక్షర చిత్రాలు బాలయ్య కవిత్వానికి వన్నె తెచ్చినయి.

బాలయ్య బతుకు తెలిసిన కవి. భవిష్యత్తున్న కవి. బాషలో, కవిత్వంలో ప్రయోగాలు చేస్తున్న కవి. పదాల మోహం ప్రతీకల వడి, పద చిత్రాల అలజడి స్పష్టతను కొంత ఇబ్బంది పెట్టి ఉండవచ్చు. భావాలను సంకీర్ణం చేసి ఉండవచ్చు. వికసిస్తున్న క్రమంలో పదునుదేరుతయి. హిందీ అధ్యాపకుడిగా పనిచేస్తూ తెలుగు కవిత్వానికి తెలంగాణ దళిత జీవితానుభవం ఎక్కిస్తున్నడు.

'దండెడ' బహుపురుల అల్లిక. బలమైన సాధనం. గట్టిదనం, పట్టుదలల ప్రతీక. పొన్నాల బాలయ్య సంకల్పం దృఢమైంది, గాఢమైంది. దండెడ పాతాళంలోంచి నీళ్లెట్లా తోడేదాకా వదులదో, బాలయ్య జీవితం అడుగు నుంచి కవిత్వం తోడేదాకా నిద్రపోడు. నిద్రపోనివ్వడు. మేలుకొన్న వాళ్ల ప్రపంచమే కవిత్వం. జీవితం గెలవాలె, కవిత్వం బతుకాలె, పొన్నాల బాలయ్య కవిత్వం మంజీర ప్రచురణగా వస్తున్నందుకు సంతోషంగా ఉంది. బాలయ్యను అభినందిస్తూ...

సిద్దిపేట్, 25 ఏప్రిల్ 2011

# చిట్లిన కలం నుంచి కారిన కవిత్వం

-డా॥ కాశీం

*"కవి సమాజంలో సమాజం ద్వారానే కవి అవుతాడు. కవి కవిత్వం రాయడానికి కావలసిన విశ్రాంతినీ, నైపుణ్యాన్నీ, విద్యా, సంస్కారాల్ని పొందే అవకాశాల్ని శ్రమజీవులే ఇచ్చారు..... కాబట్టి ఒకడు కవి కావడానికి కవిత్వం రాయడానికి సమాజమే కారణం."* అని త్రిపురనేని మధుసూదనరావు కవి గురించి చెప్పిన కార్యాకారణ సంబంధం కాలాతీతమైంది.

ఈ గతితార్కిక వెలుగులో నేను పొన్నాల బాలన్న కవిత్వాన్నిముని వేళ్ళతో ముద్దాడుతున్నాను. ఎండిన పెదవులను పదను చేసుకుంటున్నాను. కనురెప్పలపై నాలుగు దీపాలను వెలిగించుకుంటున్నాను. చూరు సందులో నుంచి మసకగా పొడుస్తున్న సూర్యునిపై చిందేస్తున్నాను. దండెం మీద ఆరేసిన ఎండు తునకల రుచిని ఆస్వాదిస్తున్నాను. మరణించిన ప్రతిసారి సూర్యునిపై ఉదయిస్తున్న మనుషుల్ని చూస్తున్నాను. చార్వాకుని సమాధి నుంచి లేస్తున్న అక్షరాలను వీక్షిస్తున్నాను. తడిసి ముద్దయిన గుండెల నుంచి కారుతున్న బురదలో నాలుగు కన్నీటి బొట్లు రాల్చుతున్నాను. ఆకాశానికి కాసిన స్తూపాలు గోగుపువ్వులా రాలిపోతున్న విషాద కాలానికి కావలి కాస్తున్నాను. నిండుకుండలా విచ్చుకుపోయిన చూలాలి కడసారి కన్నీటి బొట్టును కలగంటున్నాను. లందలో పొడుస్తున్న మనిషిని గుండెకు హత్తుకుంటున్నాను. గిరాయిపల్లిలో కాలిపోయిన పచ్చని కలలను గుర్తుచేసుకుంటున్నాను. కలం పెదాల మీద నుంచి జారిపోయిన కొమ్రన్న, బాలగోపాల్, కన్నాబిరాన్ జ్ఞాపకాలతో తడిసి ముద్దవుతున్నాను.

*ఇది బాలన్న కవిత్వానికుండే బలం. ఆర్ద్రత. శిల్పనైపుణ్యం.*

కొందరు కవులు స్వీకరించిన కొన్ని పదబంధాలు, పదచిత్రాలు నిర్మలత్వంతో శిశువుని పోలి ఉంటాయి. ఆకుపచ్చ బాల్యం. ఎద్దు ముగలు. నారుమడిలో కొంగల తపస్సు. విచ్చుకుంటున్న అడవిమల్లెలు. కవిత్వంలోకి సహజంగా ప్రవేశిస్తాయి. ఈ సుకుమారమైన జీవితం బాలన్న కవిత్వంలో లేదు. బాలన్న కవిత్వంలో అన్నం ముద్ద కోసం వెతుకులాట. నాలుగు అక్షరాల కోసం వేల కన్నీళ్ళ ఘోష. కుతకుత ఉడికిన బాల్యం. కత్తులపై నడిచిన యవ్వనం. సాలు సాలుకు కారిన చెమట. గుడిసె గోడకు గుండెలు బాదుకున్న మనుషులు. ఇట్లా కవిత్వం నిండా పారిన బతుకు ఎతలు మనల్ని కట్టిపడేసి ప్రశ్నిస్తాయి. ఇట్లాంటి సహజ కవి బాలన్న. అతని కవిత్వాన్ని తూచే సత్తా నాకు లేదు. ఎందుకంటే అతడికున్నంత జీవితం నాకు లేదు. తెలంగాణ భాషపై అతడికున్న పట్టు కూడా నాకు లేదు. కాని పుట్టిన సామాజిక స్థితి, వర్గం, ప్రాంతం ఒకటి కావటం వలన ఆయన పుస్తకానికి ముందు మాట రాసే అర్హత లభించింది. అతడంత కాకపోయినా కొంత జీవితం కూడా ఈ అవకాశాన్ని ఇచ్చింది.



ఖడ్గ చాలనం చేసిన వేములవాడ భీమకవి మొదలు, 'మరణం చివరి చరణం' కాదని చెప్పిన అలిశెట్టి ప్రభాకర్ వరకు అద్భుతమైన కవులకు జన్మనిచ్చిన నేల కరీంనగర్. సారవంతమైన కవితా వ్యవసాయం చేసిన కలం యోధులకు ఈ జిల్లాలో కొదవలేదు. బాలన్న కూడా ఈ వరుసలోని వాడే. హుస్నాబాద్‌లో పుట్టడమంటే చరిత్రలో దొరికిన అరుదైన అవకాశం. ఆ అవకాశం బాలన్నకు దొరికింది. ఆ మట్టిలో నడయాడిన పాదాలు తెలుగు సమాజంపై చెరపలేని ముద్ర వేశాయి.

'ప్రతి సమాజానికొక చరిత్ర ఉంటుంది. ఆ చరిత్రకొక పరిణామం ఉంటుంది. ఇట్లాంటి చారిత్రక గమనంలో పుట్టిన కవి ప్రగతిశీలి అయితే, సామాజిక చలనాన్ని ముందుకు నడిపిస్తాడు.' బాలన్న కవిగా చలనశీలమైన సందర్భంలో పుట్టాడు. ప్రపంచీకరణ పడగ నీడ కింద అక్షరాలను పేర్చుకున్నాడు. 'నాలుగు పడగల హైందవ నాగరాజు'కు చితిపేర్చిన సమయంలో పద్యాన్ని అల్లుకున్నాడు. 'ఆమెకు మెదడున్నది ఆలోచించనివ్వండి.' అంటూ ప్రశ్నల కొడవళ్ళు ఉదయించిన వసంతాన కవిత్వం నేర్చుకున్నాడు. హిమాలయాల శిఖరాన పూసిన త్యాగాన్ని ఎదకు అద్దుకొని లేచి నిలబడ్డాడు. పుట్టిన కులం(మాదిగ) నిషిద్ధమైన చోట నిప్పురవ్వలా దూసుకొచ్చాడు. విజన్ 2020తో యువతకు విజన్ లేకుండా చేసిన కాలంలో ప్రజా రాజకీయాల విజన్ కవిత్వానికి ఎండు తునకల రుచిని చూయించాడు. ఇప్పుడు హిందీ పండితుడిగా తెల్లని బాల్యానికి అక్షరాలను తాపుతున్నాడు.

ఇప్పటికే బాలన్న కవిగా తెలుగు సాహిత్యంలో 'ఎగిలివారాడు'. కాలిపోతున్న పేగుల కమురు వాసనతో తెలుగు కవిత్వంలోకి నిశ్శబ్దంగా ప్రవేశించాడు. కన్నీళ్ళు, అక్షరాలు కలగలిసి రాలినప్పుడు దోసిలి పట్టిదాచుకున్నాడు. చితికిన వేళ్ళను, చిందిన నెత్తురును మన కళ్ళ ముందు దృశ్యమానం చేశాడు. కూలిన జీవితాలు, కళేబరాల కంపు, పేగులెండిన సింగరేణి, నరాలు తేలిన నదులు... ఇట్లా ధ్వంసమైన ప్రతీది అతని కవిత్వం ద్వారా మన స్మృతి పథంలో సాక్షాత్కరిస్తుంది. వలస అంటే అదొక వేదన. పాలమూరు నుంచి పట్నం పోయినా, హుస్నాబాద్ నుంచి మస్కట్ పోయినా ఎడబాటు ఒకటే. కళ్ళెదుటే బాంబేకు వలసపోయిన తండ్రి శాశ్వతంగా జీవితం నుంచే నిష్క్రమిస్తే ఆ దుఃఖం ఎలా ఉంటుందో బాలన్నకే ఎరుక. తల్లి ముఖంలోనే తండ్రిని చూసుకొని యవ్వన కలలను కవిత్వం చేశాడు. అవ్వ ముఖంపై మెరిసే ముత్యపు మెరుపులో తన దారి వెతుక్కున్నాడు. ఎరుపెక్కిన చీకట్లో ప్రపంచాన్ని చదివాడు. జీవితానికి, ప్రపంచానికి సంధి కుదరడానికి అంతర్, బహిర్ పోరాటం చేశాడు. నింబోలి అడ్డ హాస్టల్ నుంచి హైదరాబాద్ నగరాన్ని వీక్షించాడు. పండిట్ శిక్షణతో పాటు, కొన్ని విలువలను, ఆరాట పోరాట నగర జీవితాన్ని మోసుకొని హుస్నాబాద్ వెళ్ళాడు. నడిరాతిరి మట్టి పువ్వులతో సంభాషించి కవిత్వానికి మట్టిని అద్దాడు.

చీకట్లు కమ్మిన జీవితం నుంచి
పొద్దుపొడుపును ముద్దాడిన బాలన్నకు ఈ పుస్తకం రెండోది.

రెండు కవిత్వం పుస్తకాలను తెలుగు సాహిత్యానికి అందునా, తెలంగాణ సాహిత్యానికి బాలన్న

కానుకగా ఇచ్చాడు.

ఈ పుస్తకంలోని కవితలను అధ్యయన సౌలభ్యం కోసం నాలుగు రకాలుగా వర్గీకరించుకోవచ్చు.

1. *తెలంగాణపై రాసిన కవితలు*
2. *దళిత జీవితంలోని సౌందర్యాన్ని తెల్పే కవితలు*
3. *అర్ధాంతరంగా ముగిసిన జీవితాలను గుర్తు చేసుకొనేవి*
4. *స్త్రీలు, గ్రీన్ హంట్, వాగు, చెట్టు, వలస, స్థూపాలు మొదలైన అంశాలపై ఉన్నకవితలు*

ఇవ్వాళ తెలంగాణ పొడుస్తున్న పొద్దు. రాలిపోతున్న సూర్యగోళం. కురుస్తున్న చందమామ. అమవాస్య చంద్రుడు. ఇదేమిటి ద్వైయిది భావం అనుకోకండి. ఇది వాస్తవం. నిప్పులు చిమ్ముకుంటు నింగికి ఎగిసిన పోరాటం అంతే సహజంగా నెత్తురు కక్కుకుంటూ నేలకు రాలిపోతుంది. వర్తమాన చరిత్రలో ఒరిగిన ప్రతి వీరుడికొక చరిత్ర ఉన్నట్లే, ప్రతి జననానికొక వాక్యం మొదలవుతుంది. కనుక

*"దోసిల్లల్ల కాలం బరివాతల*
*అగాధంలోకి జారిపోతున్న దృశ్యం"*(పోరాట బిడ్డలు) బాలన్న కవిత్వంలో నిక్షిప్తమైంది. తెలంగాణ కోసం నిజాయితీ గల పోరాటం చేస్తామని చెప్పిన వాళ్ళ ఇల్లు దాటలేదు. ఇల్లు దాటిన వాళ్ళు పోరాటం చేయలేదు. కనుకనే తెలంగాణ దారుల వెంట పరుగెత్తె యవ్వనం అర్ధాంతరంగా వాలిపోతున్నది.

*"ఆకలిగొన్న మెదళ్ళ నిండా*
*ఆవేశాల అగ్గిపూల నింపుకొని*

. . . . . . . . . . . . . . . .

*మబ్బుల చాటు జ్ఞానరెక్కలకు*
*నిప్పంటించుకొన్న సూర్యులు"*(అదే) ఇంటికొకరు మిగిలే పరిస్థితి నిరాసక్త రాజకీయ నాయకుల వలననే దాపురించింది. యుద్ధంలో ఒరిగిపోయి వాకిట్లో ముగ్గులైన బిడ్డలను కన్న తెలంగాణలో యుద్ధం లేకుండానే, కత్తి కన్పించకుండానే నెత్తురు వరదలవుతుంది. ఈ రక్తపు మరకలకు కారణం ప్రభుత్వమేననే స్పష్టత బాలన్నకు ఉన్నది. అందుకే ఎదురించి జీవించిన వాడు వీరుడు. రాలిపోతున్న బిడ్డలారా జీవించడం కోసం పోరాడాలని పిలుపునిచ్చాడు.

తెలంగాణ జీవితంలో డప్పు ప్రధాన భాగం. మాదిగ లొద్దిలో పుష్పించిన దరువు వూరునంతా నిద్రలేపుతుంది. ముప్పై రెండు కళలను పండిస్తుంది. చిర్రా చిటికెన పుల్ల ఆకాశం ఎదపై చిందేస్తాయి. పుట్టుక, ఆరాటం, పోరాటం, అమరత్వం సందర్భమేదైనా డప్పుకు అసందర్భమే లేదు. చాటంత పరుచుకున్న చరిత్రకు సాక్ష్యంగా ఉండే డప్పు ఎందుకో మౌనంగా ఉంది. కారణం అమెరికా యాంటెనాలో ఉందో అగ్రకుల మంత్రంలో ఉందో కనిపెట్టాలి. ఇద్దరూ తోడు దొంగలే.



*"కడుపు కాలి శిలుక్కొయ్యకూగులాడే పాత డప్పు*
*గుడిసె గోడకు గుండెలు బాదుకుంట పల్గిపోయింది"*(దుర్భణి) సెలయేటి పాట ముక్కలైంది. ఎన్ని తీర్లుగా చేతివృత్తులు, జీవితాలు ధ్వంసమయ్యాయో బాలన్న కవిత్వంలో చూడవచ్చు. తీరిగ్గా కూర్చొని తన బాధనో, ప్రకృతి దృశ్యాలనో కళాత్మకంగా వర్ణించడం కాకుండా యదార్ధ దృశ్యాలను కవిత్వం చేశాడు. దీనిని కవిత్వంగా అంగీకరించే దమ్ము ఉండాలంటే నిప్పుల కొలిమిని తాకే ధైర్యం ఉండాలి. వీల్ చైర్‌లో కూర్చొని వస్తు, శిల్పాలను తూచే కుహనా విమర్శకులకు శిలుక్కొయ్య గుండె బాధ అర్ధం కాదు. అంటరాని పెనుమంటల మధ్య సలసల కాగుతూ విలక్షణమైన నుడికారంతో, డిక్షన్‌తో కవిత్వం రాయగల సత్తా బాలన్నకే ఉంది.

*"ఘనీభవించిన నా గుండె అంచుల మీద*
***చెవులు పెట్టి శత్రువు అలికిడి పసిగట్టకపోతే"***(స్పిరిట్ తగ్గిందా) గోగుపువ్వుల రథ చక్రాలతో నింగికెగిరిన అమరుల స్వప్నం వృథా అవుతుందని చెప్పగలిగిన కవితాత్మక శక్తి బాలన్నది. అద్భుతమైన భావనా శక్తితో గోగుపువ్వుల ప్రతీకలను జోడించడం బాలన్న లాంటి నిజమైన కవులకే కాని, నిఘంటువు కవులకు సాధ్యం కాదు. తెలంగాణ ఉద్యమంలో జనం బలం లేని లీడర్లు చాలామంది ఉన్నారు. వీళ్ళంతా ఎంగిలి కంచాల కాడి బొక్కలే తప్ప హీరోలు కాదనే స్పష్టత ఈ కవికి ఉంది.

రాజులను, రాజ్యాన్ని దునుమాడే వాడే నిజమైన కవి. అలనాడు తెలంగాణ నేలలో పాల్కుర్కి పోతన, బండి యాదగిరి, సుద్దాల హన్మంతు, దాశరథి, మఖ్దూం, కాళోజి. ఈనాడు ఆ వరుసలో బాలన్న. విప్లవోద్యమాన్ని రక్తపుటేరుల్లో ముంచి, తెలంగాణ ఉద్యమాన్ని అణచివేసి వెకిలి నవ్వులు నవ్విన రాజశేఖరరెడ్డిని సాక్షి పేపర్‌లో స్థానం కోసం పొగుడ్తూ రాసిన కవులు కూడా ఉన్నారు. కాని బాలన్న

*"పెయ్యంత వరం లేని నాలుకల రాజేంద్రుడు*
*పాయిరాల గుట్టల్ల తలపండు పలిగిన"*(నీ అయ్య జాగిరా?) తీరును మన్ను బుక్క సాక్షిగా చెప్పాడు. నీళ్ళ వెంట సంస్కృతి. సంస్కృతి వెంట నాగరికత విలసిల్లిందని చరిత్ర చెబుతుంది. సాగరమంటే నీళ్ళే. నీళ్ళంటే బతుకు. బతుకంటే జీవితం. జీవితమంటే పోరాటం. సమస్త కార్యాకారణాలకు నీళ్ళే ఆధారం. బహుశ భవిష్యత్‌లో నీటి యుద్ధాలే ఉంటాయి కాబోలు. కాస్త నేల మీది నుంచి మాట్లాడితే తెలంగాణ. నీళ్ళు లేని గాణం. కాదు కాదు. వ్యాకరణ దోషం. నీళ్ళు దక్కని గాణం. రెండు జీవనదుల మధ్యన జనని గర్భంన ఉమ్మనీరు కోసం కండ్లల్ల సుదులు తిరుగుతున్న సముద్రం అంచున

*"అలల తడిమీద సిద్ధార్థుని ఆత్మ*
*ఆధర్మానికి దుఃఖిస్తుంది"*(అలలతడి) ఈ పద్యాన్ని చదువగానే హృదయంలో

బరువెక్కుతుంది. వెంటనే భళ్ళున కన్నీళ్ళు కారిపోవల్సిందే. ఆ వెంటనే నాగార్జునసాగర్ నిర్మాణంలో కె.ఎల్.రావు చేసిన కుట్ర మన కళ్ళ ముందు స్క్రోల్ అవుతుంది. ఎడమ కాల్వను మింగేసిన ఆంధ్ర కుడి కాల్వ అగ్రగండం చూసి కొండమీది నాగార్జునుడి తపస్సు భగ్నమైంది. తెలంగాణ నీటి దుఃఖాన్ని పంటి పెదవి కింద అదిమిపట్టిన బాల్యాన్ని ఈ కవితలో విన్పించాడు.

తెలంగాణ డిమాండ్ ఎజెండా మీదికి వచ్చినప్పుడల్లా కోస్తాంధ్ర మేధావులు దీన్ని వేర్పాటు వాద కోరికగా ప్రచారం చేస్తుంటారు. ఈ దేశం నుంచి విడిపోతున్నట్లు మీడియా మొత్తుకుంటుంది. "దేహంలో శిరస్సు భాగమే! దేశంలో ఈ నేల భాగమే"(భరోసా)ననే సమాధానం కవి మాత్రమే చెప్పగలడని అర్థమైంది. 'అల్పాక్షరాలలో అనల్పార్థం' అంటే ఇదే.

*"పాంచ్ రాస్త్రాల కత్తి మొనల మీద*

*నెత్తుటి మడుగుల గాయాలతో నడుస్తున్న శిరస్సు"*(భరోసా)లు తెలంగాణ కోసం గొంతెత్తి అరుస్తుంటే 'మా బతుకులకు భరోసాలేదని ఆంధ్రులు మొత్తుకోవటం సిగ్గుచేటని అరవై ఏండ్ల సమైక్య చరిత్ర రుజువు చేసింది. ఆంధ్ర భద్రమే. ఆంధ్ర భాష భద్రమేననే వ్యంజనం బాలన్న కవిత్వం నిండా చూడవచ్చు. పదేళ్ళ తెలంగాణ ఉద్యమంలో కవిత్వం జాడ తెలుసుకున్న ఈ కవి తెలంగాణ భాషను, చరిత్రను, పోరాటాన్ని, అమరత్వాన్ని భద్రం చేస్తున్నాడు. తన కాలం అంచున నిలబడి, పొడుస్తున్న పొద్దు మీద నడుస్తున్న ఈ కాలం కవి బాలన్న.

ఈ దేశంలో మూడు వేల సంవత్సరాల కింద వెలివాడ సృష్టించబడింది. లందలో ఎర్రని పొద్దుపొడని మింగిన మనుషులు సింత గింజ అంబలి తాగి చరిత్రకు ముగ్గుపోశారు. పురాణాల ప్రకారం భూమితో పాటు పుట్టిన జాంబవంతుని వారసులు వీళ్ళు. దొబ్బల దొంతుల అమృత గోర్జం తిని భూమిని ముద్దాడిన మట్టిమనుషులు. మాదిగ బిడ్డలు. వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో దళితుల జీవితం అంటరానిదైంది. మనుషుల జరుగుబాటు కోసం కాగడాగా వెలిగిన క్షణాలు చీకట్లో కలిసి పోయాయి, కొండగోగుల్లా రాలిపోయిన దళితుల చరిత్రకు బాలన్న పట్టం కడుతున్నాడు. దళిత ఈస్తటిక్స్‌ను సాహిత్యంలోకి ఈడ్చుకొస్తున్నాడు.

*"ఆరె రంపెతో చర్మాన్ని*
*అనువుగా విడిపించె కారగిరి*
*లందల పారెమారు చెక్కలు ఉల్కిన శెల్ల*
*తోలును పారకట్టెతో మడత సఫాయిదీసి*
*పనిగూటం గుద్దిన శీరకకు"*(అలుకల చెప్పులు) నమస్కరించి అలుకల చెప్పుల అసలు మహిమను ప్రపంచానికి పరిచయం చేస్తున్నాడు. ఈ ప్రపంచంలో మొదటి డాక్టరైన మాదిగవాడి వృత్తి నైపుణ్యాన్ని నిక్షిప్తం చేశాడు. మనిషి కాలుకు మెత్తటి పరుపుగా మారిన చెప్పు తయారు కావడానికి జరిగిన కృషిని ఈ కవితలో చూడవచ్చు. పశువు చర్మాన్ని ఒడుపుగా ఒలిచి పాదుకలతో



పదనిసరాగాలు పల్కించిన వాడికి 'అప్పువద్దది సుమా భారతావని వీని సేవకు'(జాషువా) అని చెప్పటమే కాకుండా జంబు దీపాన్ని పాలించినవాడు అంటరాని వాడెట్లయ్యేననే అవసరమైన ప్రశ్నను బాలన్న నాలుగు పడగల హైందవ నాగరాజు పైకి సందించాడు.

*"గొద్దెలకు గొద్దెలకు పియ్యి, ఉచ్చ*

*ఎడ్డురకం లేకుండా ఎత్తిపోసుడు ఏంది"*(ఎక్కుబెట్టిన ఆయుధం)నే ప్రశ్న తెలుగునాట దళిత ఉద్యమం మొదలైనప్పటి నుంచి ఉంది. కాని మొహమాటం లేకుండా జీవద్భాషను అవసరార్థం ఉపయోగించటం బాలన్న చేసిన మొదటి ప్రయోగం. మద్దూరి నగేష్‌బాబు, పైడి తెరేష్‌బాబు, ఎండ్లూరి సుధాకర్, శిఖామణి వలె దళిత భాషను, జీవితాన్ని సాధికారికంగా కవిత్వంలోకి తెచ్చిన కొద్దిమందిలో బాలన్న ఒకడు.

ఈ దేశంలో అగ్రకుల బ్రాహ్మణిజాన్ని ప్రతిఘటిస్తూ భావం కంటే పదార్థమే ముఖ్యమని చెప్పి, ఈ ప్రపంచమంతా పదార్థం చేత నిర్మించబడినదని వాదించిన వాళ్ళు చాలామందే ఉన్నారు. వాళ్ళలో చార్వాకులు అగ్రగణ్యులు. శూద్ర తాత్త్వికత నుంచి భావజాల రంగంలో వీళ్ళు విశేషకృషి చేశారు. కనుకనే అగ్రకుల రాజ్యం ఆనాడు వీళ్ళను హత్యచేసింది. కాని

*"చార్వాకున్ని సజీవంగా కాల్చిన*

*కాష్టం నుండి నిప్పు కణ అక్షరమై ప్రశ్నించు"*(అగ్గిపువ్వు)మనే చైతన్యం మాత్రం మిగిలే ఉంది. అందుకే బ్రాహ్మణ చేతుల్లో బంతులైన శ్రమజీవుల శిరస్సులన్నీ అంటరాని రక్తం అప్పుతీర్చమని అడుగుతూనే ఉన్నాయి. అగ్గిపువ్వుల అక్షరాలై బాలన్న వలె చరిత్రను తిరగరాస్తున్నాయి.

నిచ్చెన మెట్ల కులవ్యవస్థలో ప్రతీ కులానికి మరో కులం కింద ఉంది. ఆధిపత్యం అందరూ అందరి మీద చలాయిస్తున్నారు. అగ్రకులాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న చైతన్యంలో నుంచే సామాజిక న్యాయభావన కింది నుంచే ఉండాలనే ప్రశ్నలు ముందుకొస్తాయి. అట్లా వచ్చిన ప్రజాస్వామికమైన ప్రశ్న 'ఎస్సీ రిజర్వేషన్ వర్గీకరణ' అందుకే బాలన్న

*"ఉమ్మడి హక్కులు వర్గీకరించుమంటే*

*కల్పుందామని... కథలు చెప్పుతుండ్రు"*(జులుం-దూప) అనే అవగాహనను కవిత్వంలో చెప్పగల్గిండు. ఈ లక్ష్య సాధన కోసం మరణించిన ప్రతిసారీ సూర్యుడినై ఉదయించటమే కాకుండా కొత్త కవితనై బతికొస్తానని చెప్పటమే శిల్ప నైపుణ్యానికి తార్కాణం.

ప్రధానంగా ఈ పుస్తకంలో తెలంగాణ, దళితులపైననే ఎక్కువ కవితలు ఉన్నాయి. ఇవి కాకుండా భగ్నమైన తల్లి హృదయంలో పొంగిన దుఃఖాన్ని చూసిన బాలన్న మౌనంగా ఒలికిన ప్రతి స్త్రీ కన్నీటిని పసిగట్టగలిగాడు. పెదాల మీద జారిపోయిన ప్రొఫెసర్ కొమ్రన్న, వర్గీకరణ ఉద్యమం కోసం ఒంటిపురి మీద ఊగులాడిన సురేందర్ మాదిగ, కత్తులు దిగిన గొంతుల నుండి నెత్తురు ప్రవహిస్తున్నప్పుడు బల్లున పొడిచే సూర్యునిలా దూసుకొచ్చిన కన్నాభిరాన్, రాజ్యఖడ్గ చాలనానికి హక్కుల సూర్యుడై

ఎదురు నిలిచిన బాలగోపాల్, జానపదుల మనో పలకంపై మహాకావ్యమైన మిద్దెరాములు లాంటి అర్థాంతరంగా ఆగిపోయిన జీవితాలను స్మరించుకుంటూ కొన్ని పద్యాలున్నాయి.

దళితులకు, శ్రమజీవులకు చెట్టు, పుట్టలే చుట్టాలు. తన మెత్తటి చేతులు చాపి ఆటపాటలకు ఆహ్వానించిన వేపచెట్టు ఎండిపోతే కవి గుండె ఎంతగా గాయపడుతుందో 'చెట్టు కవిత' చెప్పింది.

తెలంగాణలో వాగు ఇప్పుడొక పురా స్మృతి. రియల్ ఎస్టేట్ వ్యాపారం రెక్కల చప్పుడుకు వాగుల్లో నీరింకిపోయింది. భవనాలు మొలకెత్తాయి. కాంక్రీట్ జంగల్ పరివ్యాపితమైంది. ఇట్లాంటి కాలంలో వాగు కోసం కవిత రాయటం అపురూపమే. కుండపోతగా కురుస్తున్న జ్ఞాపకాలను మన ముందు దించుతే....

*"ఆరబోసిన అక్షరాలలో పొర్లితే*
*వొంటికంటిన పంచ వర్ణ పాద ముద్రలే*
*బతుకు పుస్తకం మీద తడితడిగా తగుల్తయి"*(వాగు-నేను-కల)

వాగు కరిగిపోని కల. వాగుఒడ్డున ఒరిగిపోయిన వీరులు. వెంటాడుతున్న త్యాగం. గిరాయిపల్లి మృతవీరులు నలుగురు. ఆ వీరులు తెలుగు నేలపై చెరిగిపోని ముద్రవేసారు. ఆ ప్రభావం బాలన్నపై కూడా ఉంది. కనుకనే

*"పచ్చని కలలను కాలుస్తున్న శబ్దం*
*వెత్తి మీద ఖడ్గాలు మొల్చిన చెట్లను*
*కసితో నరుకుతున్న అలికిడి..."* విన్నాడు. చిక్కటి కవిత్వాన్ని కన్నాడు.
*"ఎన్ని బాలకిరణాలు ఎదురు ఈదెనో*
*ఇపుడు వడివాగుల భగ్గునమండే సూర్యుడు*
*పెయి మీద పెట్రోలు పోసుకొని*
*నిత్యం... దహనమౌతున్న దృశ్యమే"*ఇంకా కొనసాగుతున్నది. అది 1946 అయితే మన తాత. 1969 అయితే మన తండ్రి. 1976 అయితే మన అన్న 2009 అయితే మనమే. తెలంగాణ చరిత్ర నిండా ప్రవహిస్తున్న రక్తం, రాలిపడుతున్న మాంసం ముద్దలు మనవే. ఈ గతితార్కిక సంబంధాన్ని బాలన్న బలంగా పట్టుకొని చిక్కటి కవిత్వం అల్లాడు.

ఇక కవిత్వంలో మంచిచెడుల విషయం చూస్తే కొన్ని కవితలు బలహీనంగా ఉన్నప్పటికీ, కొత్త ప్రతీకలు, పదబంధాలు, భావచిత్రాలు అన్నిటికి మించి మంచి తెలంగాణ భాషను బాలన్న సాహిత్యానికి పరిచయం చేశాడు. వస్తు, రూప నిర్మాణంలో పట్టున్న కవితలకు ఈ పుస్తకంలో కొదువలేదు. గోగుపువ్వుల రథచక్రాలు, పండిన దొండపండు దేహం, నమ్మకం నిట్టాడై నిలబడ్డప్పుడు, తలపువ్వ వేసే మక్కకర్ర, పరిగెత్తే కాలాన్ని మెడల వేలాడదీసుకొని, కండ్లు ఎండిన చెరువు లాంటి ప్రయోగాలు అద్భుతంగా ఉన్నాయి. కొత్తగా ఉన్నాయి. వెంటాడే వాక్యాలుగా నిలిచిపోయాయి.



తెలంగాణ పదప్రయోగంలో కవిత్వం విషయానికి వస్తే బాలన్ననే మొదటివాడనిపిస్తుంది. 'ఐరివాతల, సితపతాలం లోతు, యాస్ట, రాలేచెట్టుకు దీటీలు,కాత్తే రాజులు మెచ్చరు, దొప్పెదు, ఏతులు మొదలైన పదాలు సందర్భానుసారం కవిత్వంలో పొదిగినవి. తెలంగాణ నుడికారాలను, సామెతలను కూడా బాలన్న చక్కగా కవిత్వంలో వాడాడు.

*"దిద్ది దిద్ది గోసిపెడుతే*
*దగ్గ వరకే వూసిపోతది"*(అడివొక అస్తిత్వం) అంటూ అడవి అస్థిత్వాన్ని గ్రీన్‌హంట్ నేపథ్యంలో రాయటం చూస్తే బాలన్న విస్తృత అధ్యయనం ఉందనిపిస్తుంది. ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం అనే లక్షణాలు కవికి ఉండాలని అలంకారికులు చెప్పారు. ఈ మూడు గుణాలు ఈ కవికి ఉన్నాయని ఈ పుస్తకం చదివితే తెలుస్తుంది.

*"అడివొక రహస్యం*
*అడివొక చైతన్యం"* కనుక అడవంటే ఆగమ పచ్చికాదు, పొంగే అగ్నిపర్వతాల ఖిల్లా.

మనిషి కోసం పోరాటం. సమాజం కోసం త్యాగం. అడవి కోసం యుద్ధం, మైదానం కోసం అమరత్వం. హిమశిఖరాల వంటిది. గాయాలను ఒత్తుకుంటూ సలాం చేస్తూ హుస్నాబాద్ స్థూపం బాలన్న యవ్వనం లాగానే ఉదయించే సూర్యునివలె పొడిచింది.

*"గోగుపువ్వులు నడిపి ఆడిన జ్ఞాపకాల కలవరింత*
*హుస్నాబాద్ ఎల్లవ్వ తల్లి సిగలో*
*పూసిన నల్ల బతుకమ్మ కిరీటం*
*శ్రమజీవులు తలెత్తుకొని*
*శిఖరానికెత్తిన సుత్తెకొడవలి"*(స్థూపం)

నడుస్తున్న చరిత్రలో దళితులకు చోటులేనట్లే, గడిచిన చరిత్రలో కూడా లేదు. స్వాతంత్ర్య పోరాటంలో బ్రిటీష్ సేనాని డయ్యర్‌ను చంపి ఈ జాతి తలెత్తుకునేలా చేసిన ఉధమ్‌సింగ్ జాతి పితల కాలుష్యంలో కనుమరుగయ్యాడు. ఇవాల్టి యువతరానికి అతడొక మాడల్

*"నీ కోర మీసం నుండి రాలిపోతున్న శౌర్యాన్ని*
*మా వెన్నుపూసలకు దిగేసుకొని*
*జాతి చేతిలో ఆయుధాలుగా నిలబడుతూ"*(జమ్మి) ఈ దేశ ప్రజలను విముక్తి చేయడానికి మిమ్ములందరినీ బాలన్న కవిత్వంలోకి ఆహ్వానిస్తూ....

హైదరాబాద్, మే 29, 2011

# దండెడపురులు





## వాగు - నేను - కల

వేలుపట్టి ఆత్మీయంగా
అరుకోషి - బురుకోషి ఆడిచ్చే
వాగు గుండెను నమ్రతతో తడ్మితే
మాతృత్వపు ఊటలు ఉప్పొంగుతూ
మది అంతరంగంలో నుర్గులు పొంగి
పదాల తెట్టు ప్రవహిస్తుంది

మొయ్యన పారే అడుగుల అందెల సవ్వడే
పదాలల్లు కోవడం నేర్పింది
పుట్టెడు ఉసికె తెప్పల మీద
ఆరబోసిన అక్షరాలలో పొర్లితే
వొంటి కంటిన పంచవర్ణ పాద ముద్రలే
బతుకు పుస్తకం మీద తడితడిగా తగుల్తయి

గుండుమీద గుండు "దొంతులోని" గుండెక్కి
గొంతు విప్పుకొన్న నీలి మేఘం
కుండపోతగా జ్ఞాపకాలను కుమ్మరిస్తు ...
మోయతుమ్మెద అలల మీద
మోదుగాకు పడవలో ఊహలు
పచ్చటి చెట్లమీద స్మృతి పతంగులై
రెపరెపలాడుతయి

వొంటికి రంగులద్దుకొన్న సింగిడి
పిల్లనగొయ్య స్వరాలు పెదాలపై వన్నెలాడి

పురివిప్పిన బుగ్గల మీద రంగురాళ్ల
గంధం దిద్దుకుంటు రోమ రోమాన నెమలీకలు
చాటంత కండ్లతో తానమాడుతయి

ధమనుల్లోని పురాస్మృతులు మత్తడి దుంకి
తంగేడు పూల ఉసికె తెప్పల మీద
కట్టుకొన్న పిట్టగూళ్ళ జర్రున జారి
మర్రి ఊడల కొసన వేలాడుతున్న
బాల్యం లోతు దొరకని చేప పిల్ల

మత్తడి శిఖరం నుండి మెత్తగా జారి
అలిసిన శరీరానికి ...
పక్క బొంతల్ల మగత నిద్రలో
హృదయాంతర నిర్మాణము
వాగు జలాలతో అనుసంధానమై
జోల పాటలతో ఓలలాడిస్తుంది

వాగుకు ఇరువైపుల పచ్చని చెట్లు
జట్లు జట్లుగా నీడనిస్తు ...
బురక పిట్టల బుర్రు బుర్రులు
అగ్గిపెట్టెలో దాసుకున్న బంగారి పురుగు
గుగ్గూగూ ... గుగ్గూగూ ... గుగ్గూగూ ...
బుడిబుడిగా వాలే తూనీగలు
గాలిలో ఎగుర్తున్న సీతాకోక చిలుకల
రెక్కల ముకం, పాలపిట్ట ఈకల అందాలతో
ప్రాణం ఖుషిగా అలుముకుంటది

నాచుల దాచుకున్న కొర్రమట్ట-నీరుగట్టె
మడుగులో మత్తుగా నిద్రిస్తున్న కప్ప పిల్ల



గుండె పొరల్ని నాజూగ్గా - స్పర్శిస్తూ ...
వాగు వొడ్డుకు ఈత చెట్టమ్మ
నోట్లో దాసుకున్న తీపి పండ్లు
నాల్కలీర బోసుకున్న తాటిగొల రాల్చె
కమ్మనికల్లు బొట్లు కడుపునిండ తాగిన యాదులు

తడలు తడలుగా తన్నుకొచ్చె
పూరి దుక్కపు కాల్వలు కల్సెచోట
జీవన పోరాట అంతిమ యాత్రలో
దింపుడు కల్లంలో దిగుల్తో దుక్కిస్తు ...
జీవన మరణ రహస్యాలను
మౌనంగా పరీక్షించె వాగు ...

కొండపాక 'గట్టు సింగరయ్య లొద్ది' దాక
అనామత్‌గా రెక్కలు కట్టుకొని ఎగిరేజీవాత్మ
అద్దుమరాత్రి కలికి గాంధారి యాల్ల
బసవన్న కట్టె కొరకని సమయాన
వాగు పుట్టువడి గిరాయిపల్లి అడివిలో
పచ్చని కలలను కాలుస్తున్న శబ్దం
నెత్తి మీద ఖడ్గాలు మొల్సిన చెట్లను
కసితో నరుకుతున్న అలికిడి ...

కారిన రక్తధారలె ....
తూర్పు నెత్తుటి సూర్యుల ప్రవాహం
పౌరుషంగా పారే ఈ వాగులో
ఎన్ని బాల కిరణాలు ఎదురు ఈదెనో !

ఇప్పుడు నడివాగుల భగ్గున మండే సూర్యుడు
పెయి మీద పెట్రోలు పోసుకొని
నిత్యం ... దహనమౌతున్న దృశ్యమే.

ఆంధ్రజ్యోతి 24 జనవరి, 2011

## స్థూపం

నాదం లేనిదే వాదం ...
ఖేదం లేనిదే బేధం రాదేమో !

రాలే చెమట, కారే రక్తం కలగల్సి
నల్ల ఏనె నరాల్లోంచి ...
ఎగిసిన ఖండాంతరాల క్రాంతి స్థూపం

నేలరాలిన నల్లని బతుకుల
ఆకాశానికి ఎత్తిన చుక్కల ప్రతిబింబం
గొంగడి బొంత గోసి సదిరి గొడ్డలి ఎగిరేసి
గొంతెత్తిన పీడిత ప్రజల బిగిసిన పిడికిలి

అదిగో ... అదిగదిగో ... గగనాన ఎర్రెర్రని
గేయాల సూర్యులు నల్లసారపు గుండ్ల మీద
గాయాలను ఒత్తుకుంట సలాం చేస్తూ
గళమెత్తి జనగానమందుకున్న
ఈ బండరాళ్ల గుండెల నిండా
గోగుపువ్వులు నడిసి ఆడిన జ్ఞాపకాల కలవరింత ...

హుస్నాబాద్ ఎల్లవ్వ తల్లి సిగలో
పూసిన నల్ల బతుకమ్మ కిరీటం
శ్రమజీవులు తలెత్తుకుని
శిఖరానికెత్తిన సుత్తెకొడవలి ...
అవనతమై ముండ్ల పొదల్లో మూలుగుతంది
మట్టిసప్నాల సౌధం విచ్ఛిన్నమై
విముక్తికై జెండాలెగిరిన భూముల్లో
ప్లాట్ల పలారం మీద గద్దలాడుతన్నయి.

*అరుణతార, జూలై-సెప్టెంబర్, 2010*



## పునరోదయ సూర్యుడు

మనస్సు కుమ్మరామి మసిలినట్టు మసులుతుంది
మూతదీసి అక్షరాలారబోయాలి
పరుపు మీద ఇటు అటు బొర్లి కండ్లంటుకొవు
దగ్ధమై పోతున్న అంతరంగాని శీతల పర్చి
పేలిపోయిన పెయ్యంత గంధం పూసి
అంటరాని దేహానికి అక్షరాభిషేకం చెయ్యాలి
బందనాలు తెగి గతి తప్పిన మతిని వెత్కి వెత్కి
చంటి పోరనికి స్నానం బొయ్యాలే !

నేను, నా స్మృతులు, అనుభూతులు
గిర్ర గిర్ర కాల చక్రముల పరిభ్రమించి
పరికి కంప పొదల్ల కాకిపిల్ల గుండెలగుచ్చుకున్న
ముల్లు పళ్లతోపీకి ముద్దివ్వమంటది
స్మశాన అడ్డల గుంపు చింతరెమ్మల
గుడ్లగూబ ఎక్కెకి ఏడుస్తంది ఏదో మార్మికంగా !
కాలుగర్రపడ్డ కదల్లేని ఎద్దు కన్నీరు-మున్నీరు
గుడిసె మూల వాసానికి వేలాడదీసిన వుట్టి
కుక్కుడువట్టిన గుడ్లమీది కోడి బెదిరి బెదిరి అదురుతుంది
గూడేమవతల ఐదు గిరుకల మంచినీళ్లబాయి
నీల్లు మర్రవడి నీలువెల్ల వలపోతంది
పీరిల కొట్టం ముంగటి పులిసేరు మండ మీదికేయి
కాలు జారిపడ్డ తొండ అబ్బుల్లతో అలింగనం కొర్తుంది
దొడ్డె అటుకుపైన ఇప్పిపెట్టిన సవారు కచ్చురం
మిద్దె చిలుక మోటికి వేలాడుతున్న బండిపయ్య
దూలల మీదె నిర్జీవమై పండుకొన్న గజ్జెల కానీ
శవ పరీక్ష చేయమంటున్నాయి ....

కండ్లు మూస్తె కండ్లు అంటుకోవు
అడివంటుకోని.... ఊరంటుకోని ....
మనుషులంటుకోని.... కలల్ని తగులవడి
అంత దట్టమైన పొగ....
మెదడుకెమన్న పొగ సూరిందా ? మొద్దుపారిందా !
పొడ్సి... తొల్సి... అవిసి ముక్కు అర్గిన వడ్లపిట్ట
పసికాళ్లకు... వెంట్రుకలు... ఉంబజుట్టి
కుయ్యి.... కుయ్యిమని వొర్రె కొడిపిల్లాయె

పాలుసేపి రొమ్ములు గుంజి, ఊపిరి బిగపట్టి
పంట పొలంల వొడ్డుమీది కేయి జారిపడ్డ అమ్మ
గుండె ఎందుకట్ల గాలి పంక గాలికి
క్యాలండర్ కాగితం కొట్టుకున్నట్టు
ధన, ధన, దఢ-దఢ కొట్టుకుంటాంది

కండ్లు మూస్తె కండ్లు అంటుకోవు
అడివంటుకోని... ఊరంటుకోని
మనుషులంత తగలబడిపోతుండ్రు
గుడిమెట్ల మీదికేయి మెడ మీద కట్టె పెట్టి నూకిన
పూజార్ని చూసి దేవుడట్ల నర్మగర్భంగా నవ్వుతుండు...
పెంటమీది ఇస్తార్ల పెండ్లి మెతుకులు
అంత దూరముండంగనే ఆకలి ముసుర్తది
పీనుగు మీద చల్లె ఏకుడు ప్యాలాలు
ఎగిరొచ్చి జేబునిండె చిల్లర నాణాలు
గల్లర గల్లర గముడ్లోని లొట్టి నిండుతాయి
దొరగడిల చితికిన మానం
రావిచెట్టుకు ఉరేసుకుంటది

అజ్ఞానం, ఆకలి, అవమానం, ఆవేశం
కారణ కార్యమూలాల్ని తోడి
జబ్బకు డప్పు బదలు తుపాకి వేసుకొన్న సూర్యుడు
రాత్రికి రాత్రే హత్య చేయబడి
పునరోదయ సూర్యుడు
జ్ఞానాన్ని వెదజల్లుతు మేల్కొంటడు.

తేది : 19.4.2011



## సుతారి

హృదయ లోతులోని దుక్క పర్వతాలు
భుజాల మీది చీకటి మబ్బుల బరువు
అతను మాత్రమే మోయగలడు
ఇంకా ఎవ్వరు మోయలేరు !

జోరెండలో నొసలు పై నుండి కారె
చెమట చుక్కల తొడ్గులు తొడుక్కొనైన స్పృశించి
అతనిని మనిషిని చూసినట్టు చూడగలవా ?

ప్రాణాతి ప్రాణమైన పల్లె శివారు వదిలి
పట్నం చెట్టెక్కిన వలసపిట్ట

పలుగు-పార-సుత్తె-కత్తి-తాపి-తట్ట
అతని దేహమంత పనిముట్ల పుట్ట

అరచేతి ఆనెలుగాసిన మొఖాలు మీది బొబ్బలు
సిమెంట్ ద్రవం తొల్సి కవిసె రక్తం
కాసు-పసుపు అద్ది నెగడు దగ్గర దగడు చూపె
జిందగ్నిలోని తకిలీబ్‌ల్ని
కొసపన్ను కింద కొర్కిపట్టి
ఆసాన్‌గా అంస్తుల పైకి.... పై పైకి
'మాడ మీద మాలు' తట్ట, ఇసుక, సిమెంట్ బస్తా
అలుపెరుగకుంట మోసుకపోయె దిట్ట

యాతనలల్ల కరుడు గట్టిన కండ్లు కంకర రాళ్లు
నొసిన శరీరాంగలు ఇటుకల తరి
ఇరిగిన ఎముకలు ఇనుప పొలాకలనిల్పి
మనిషంతా కాలి బూడిదగా రాలి
పెలుసులు పెలుసులుగా జీవ నదిల ప్రవహించే రక్తం
భూమాత నుదుటి మీద దస్కత్ చేసిన పాదం
పుటింగ్ పునాదుల్ల పాతరేయబడిన అవశేషం
ఆకాశనంటె హైటెక్ బిల్డింగ్స్ చూడుమరి !

గురితప్పిన సుత్తెపోటుకు పెద్దనేలు చిట్లి
రక్తం బొట్లు నేల నేత్రాల్లోకి ఇంకి
మన్ను-మన్నె మట్టి గుమ-గుమ పరిమళాల తడి

పరంచెకు కట్టిన మేడిముడి వొదలై పురితెగి
భవన కొసారు కొన మీదికేయి జారిపడిన సుతారి
మెడకు చుట్టుకున్న మృత్యువు పాశం బిర్రయి
నేల మీద పడి తలపగిలి చచ్చిన తోక సుక్క

ఆర్తనాదాలు, హాహాకారాలు, కన్నతల్లి
పొత్తి కడుపుల పేగులు వడితిప్పి మెలిపెడ్తాయి
ఇప్పుడు ఇనుప హృదయం కావాలి
స్పందన ప్రతిస్పందనలు లేక భవనం నిర్మించాలి కదా ?

తేది: 17-04-2011.



## అముఖ శత్రువు

హెయ్ ! చాల్ బాజీ !
కుటిల కుతంత్ర భావజాలనివి
పచ్చి అవకాశవాది, వటవృక్ష శాఖల విస్తరించ
ప్రత్యమ్నాయమే వద్దనె గుత్తాధిపతి
నల్గురెందుకు పాడు నాది నిండుతే మేలు
లోహ పెదాల మీద వెటకారపు నవ్వు
వెకిలి నవ్వు ... దొంగ నవ్వు ...
నడుపు నడువుకుని కొంకులు నరికె నవ్వు
చిగురు పువ్వుల మీద విషం చిమ్మే నవ్వు

కోరికెలు మనుషులను అవకాశవాదులుగా
మారుస్తయి మరి ! అంతా స్ట్రాంగ్ !

నిలబెట్టిన కోసిన నిజాయితే దొరకది
కొంగ జపం చేసె లంగవు కదా !

నీళ్లు - నీళ్లే - పాలు - పాలే
నిజం నిజమే, అబద్ధం అబద్ధమే
నిజం అబద్ధము రెండూ ఒక్కటి కావు !
ఒక్క అస్తిత్వ వస్తువు ఇంకొక్క వస్తువు ఎలా కాగలదు
అంత నీ భ్రమ కానీ
భిన్న వైరుధ్యాల చరాచర జగత్తు
పరిణామ క్రమమే, పరివర్తన శీలం

ప్రేమగా సహాయం చేయ రెండు చేతులు రావు
పెయ్యంత చేతులు మొల్సిన వింత రూపం

నమ్మకంగా మాట్లాడే ఒక్క మాట చాలు
ఊసరెల్లి పిత్తుల వుత్త మాటలెన్ని ?
అంతెత్తు బుసలు కొడుతున్న అహంకారం
అవిశ్రాంతంగా స్వప్నాలని కాటేస్తేనే వుంది
మనిషి విత్తనం కావాలి ... విత్తబడాలి
లోతుగా... నేల పొరల్లోకి... ఇంకా లోతుగా
అప్పుడే వేళ్లూనుకొని మహావృక్షమై ఫలించేది

మహిమాన్విత రాజదండం
నెత్తురు రుచి చూడంది నిద్రపోదు
కపాల సింహాసనంపై కత్తి కిరీటధారి కదా !
క్రూరత్వాన్ని, పశుత్వాన్ని, నిరంకుశత్వాన్ని ప్రశ్నించే
పక్షుల రెక్కలు తెగి పాడుబడ్డ బాయిల
తేలుతయి తెల్లారే వరకె !

తెలుస్తదా లేదా ! మనుషులెంత ?
విచ్చిన్నమై, విభజించబడి ముద్దలు ముద్దలుగా
దూరంగా విసిరి వేయబడుతుండ్రు
యుద్ధ రంగంలో తలపడదు శత్రువు ప్రత్యక్షంగా
లోపాయకారి, మోసగాడు, మీద మిఠారి లోన లొఠారి

అజ్ఞాతవాసం, జనం మద్యనే వనవాసం
తనకు తాను గడియారం ముల్లుకు దిగేసుకొని
మత్తుగా... గమ్మత్తుగా...
వస్తువుల్ని ప్రేమించినంత మనుషుల్ని
బండిని ప్రేమించినంత భార్యను ప్రేమించదు
కారు మీద చూపే ప్రేమ సంతానం మీద చూపదు
కొడుకు బర్త్‌డేకు గిఫ్ట్ ఏం కావాలి
వానితో గడిపే ఆ ఒక్కరోజు చాలదు !



గతిమల్లె, గరీబ్ సంసారమైనా
సతిని సుఖపెట్టొచ్చు
ఆస్తీ, అంతస్తూ, అష్ట ఐశ్వర్యాల వెంట
ఎటువైపు ఎడ్డి ప్రయాణం
ధర్మమని తెల్సిన ఆచరించదు
అధర్మమని తెల్సిన చేయకుంట వుండలేడు

పరుగెత్తి పాలే తాగు కానీ...
నిలబడి నీళ్ళను తాగకు, నీ నీడను నువ్వేనమ్మవు
అపనమ్మకం, అనుమానం పెనుభూతం
కంటిమీద కునుకురాదు, కలవరింత వింత సలపరింత

విశాల విశ్వ విజ్ఞాన పోటీలో
జ్ఞానం పెరిగి మానవత్వం తగ్గి మనిషి మరుగుజ్జు
స్వార్థం శాఖోపశాఖలై గ్లోబ్‌నంత మింగుతుంది నగ్నంగా
మోహం, వ్యామోహం, ఆశ, దురాశ
వర్తమానం వదిలి అస్థిర భవిష్యత్ ఎండమావుల వెంట
అస్పష్ట నడక... నడకలో... నడతలో....
ఎక్కడో అమాంతం లింక్ తెగింది వెరీ డేంజర్ !

ప్రశాంతంగా, నిమ్మలంగా వుండవు
ఇంకొకర్ని వుండనీయవు అంతాడాలర్‌కలే!

మురుగు-కంపు, చెత్త... చెదరానివి
మృత శకలానివి, కాల్చబడి పూడ్చబడే పార్థివ శరీరానివి
వాదం, ప్రతివాదం సమన్వయమే... చరిత్రంతా
ఒక్క విత్తనం ప్రవహించే నది, ఫలించే చెట్టువై
మహాత్మునివి కాకపోయినా ...
మనిషి కారాదు ప్లీజ్ !

*తేది : 20.4.2011*

## ఎక్కుబెట్టిన ఆయుధాలు

కుమ్మరి పురుగు మట్టితీపి
'పితి' పుర్రు ఇసుకు ఇసుకు
అప్పలోని గుర్రపు మోసుడు ఏంది ?
గంజిల ఈగోలె గట్ల తీసెసుడు
గోదకట్టం జెత్తె గోసవోసుకునుడు
పియ్యెత్తిపోత్తె పిచ్చుకుంట్లోడా ?
గెదరు కౌసు సిర్రుకొట్టుడు ....
ముద్దలకొద్ది మైల, తెముడల ఊము
గొద్దెలకు గొద్దెలకు పియ్యి, ఉచ్చ
ఎడ్డురుకం లేకుండా ఎత్తిపోసుడు ఏంది ?
గట్ల జూసుడు ?

ఓపికున్నోన్ని ఓరకుంచుండు
ఎడ్డోని మీ ఇంత సాడుబోసి
కాంట్రికిచ్చి మీదుంచి
కుసి గెంపెనల కసిరించుడు

ఏరిగి పూసుకున్న భూదవ్వ
కడిగి గాలించిన మట్టిపెడ్డ
"దబ్బునం ఈగె దొక్క గుంజి
పిల్లగోసిలజెక్కిన దుక్కం"

నౌసి పోసిన రెక్కల కట్టం
ఉప్పు మిరపకాయకుజాలని ఊడిగెం



ఆపతిల తొవ్వదీసె బర్సె
బుడిది పిర్రల్ల బుడ్డగొసుల్ల
చినిగిన ఇత్తార్ల పెంటల కొట్లాట

ఎంగిలి మెతుకుల బతుకు
చెత్తె గుత్తైన చెమటబొట్టు
అద్దెం బద్దెం జీతం
అతుకుల సంసారం

పుండాకొరు కాదు పూటకు చచ్చే పుండు
పుర్కసి పురుగు
ఏడిండ్ల పిల్లి కూన ...

ఏ.సి. గదుల్ల గూసుంటే
ఎంగిలి జీవుతాలెరుకేనా ?

కందికట్టెకు సమరు లేదు
కట్టజీవిపై కావుగాసెటోడి నెనరేది ?

ఇజ్జతికి ఇన్నాండ్లు జేసినా
అంటరానోనిగ జూసిన
ఎలుగు పొడల శక్తి
ఇస్సి మీదైన ఇన్‌సాన్ మీదైన ఒక్కటె
ఇమానంగ ఇగ చెయ్యం !

రొతకడ్గె చీపిరి కట్ట
ఏరుగుడు ఎత్తే పారకట్టె
ఎక్కుబెట్టిన ఆయుధాలై ఎగబడుతాయ్ ...
బతుకు మారే వరకు కలబడతాయ్ ...

సాహిత్య ప్రస్థానం, అక్టోబర్, 2008.

## అడివొక్క అస్తిత్వం

గుట్టకు గుండుకు ముడిపెట్టిండు
వత్తే గుట్టే రాని, పోతే గుండు పోని
అడివి మొకాన నెత్తురుబొట్టు

పాయదేర్ల రాయరంకులోడు
కాల్లున్నంత పారజాపుకోను
కత్తిని నెత్తుర్ల పులిమిండు
గిద గిద వురుకొచ్చి
కైలాటకాల కాలు దువ్విండు

పులివాయిలి కొమ్మల్ల ఎర్రఎర్రని
దేహమంత వెలుగు సూర్యుని ఆపెచ్చెన
ఓపానసత్తి వొంటి నిట్టాడు

తలపాపిన తల్లి పాపెడ నిండ
నేల రాలుతున్న సుక్కల తిలకం
కొమ్మకొమ్మన బిడ్డల మరణాల మొలిసి
పచ్చిబాలింత పాలసేపు

పువ్వులు కాయలు పూదిచ్చిన తనువంత
తుపాకి మొనలు పూస్తు
నకిరీకె కండ్లల్ల కారుతున్న రక్తధార

మారేడు తీపి సీతఫల్క గూగం
బొడ్డున బాంబులు పేలి సిల్లక చిత్తురు
ఆదివాసి పీకలల్ల తూటాలు దిగి



గంటమూగలనాదు గంగెద్దు రంకె
కలుపకట్టె పుల్లనగోయి యుద్ధ నినాదం

అడివొక్క అస్తిత్వం
అడివొక్క రహస్యం
అడివొక్క చైతన్యం
అడివి మీద యుద్ధానికి
దిద్దిదిద్ది గోసి పెడుతే
దగ్గె వరకే వూసిపోతది

మిడిగుడ్ల పిలగండోడు
మటేల్ను తల్లని మాయంజేయ జూస్తే
అర్లుకల్ల అడివి బిడ్డలు
కంక పొదలకు కదనతంత్రం నేర్పిన
సమ్మక్క సారక్క గెరిల్లా బాణాలై
పాపుల పారగొడుతారు

పలుగురాళ్ళ ముల్లెలు పదునెక్కిన ఆయుధాలు
వడిగట్టిన కారం వడిసెలగురి
ఏకలవ్యుని తెగిన ఏలు
సిల్ల కొయ్యలై కుల్లబొడుతూ
కాశపుల్లలే కొమురంభీం శరాలై
పొలిమేర దాటగొడుతూ
బిర్సాముండ ఈటెలై
రాజ్యం మెడలో ఏలాడే కత్తులౌతయి

జాగ్రత్త బిడ్డా ! జర జాగ్రత్త !
అడవంటే ఆగమ్మ పచ్చిగాదు
కాలేస్తే భస్మమయ్యే చెత్తగాదు
రోమరోమాన రోషం పొంగే అగ్గిపర్వతాల ఖిల్లా.

ప్రజాసాహితీ, అక్టోబర్ 2008

## ఎండిన వేప చెట్టు

నివ్వద్దె తల్లికి ప్రతీకలా
గుల్లె ధ్వజస్థంభంగా
బల్లె జ్ఞాన బోదోలె నిల్సింది చెట్టు

బండెడు ఆరాటాలు
మోపెడు ఆశయాలు
సందెడు పోరాట బీజాల
కొమ్మల, రెమ్మల, ఆకుల కంటినీలాల్లో
పచ్చటి కలలను మోస్తూ
వెచ్చటి సూర్యకిరణాల నీడై
గుబురు మండల్ల, గుంపు శాఖల్ల
పక్షుల గూళ్ళల్ల ...
చిట్టి పొట్టి ఎన్నీల పిట్టలు
కండ్లు తెరువని కాకి పిల్లలు
రంగురంగుల సీతాకోక చిలుకలు
పసిడి బుగ్గల పాలపిట్టలు
కసికాయల, పసిబాలల
తన మెత్తటి చేతులు చాపి
ఆటపాటలకు ఆహ్వానించింది
గుండెల మీద చోటు నిచ్చింది
చల్లటి ఛాయల గొడ్గునిచ్చింది

వృక్షశాస్త్ర పరిభాషలో అజారికా ఇండికా
సైన్స్‌కు ల్యాబ్ గణితం లెక్కై



సామాజిక ప్రయోగశాల
సమావేశాల సలువ పందిరి
భాష శాస్త్రానికి భావాత్మక కవిత
పరీక్ష హాలులా, పఠణాలయంగా
పాఠశాలల ఆట మైదానంలా
పరిగెత్తే కాలాన్ని మెడల వేలాడదీసుకుని
ఘనఘన మోగే గంటనాథం ...

కట్టుబాటు క్రమశిక్షణ కర్తవ్యం
చదివే విద్యార్థికి ఎదిగే ప్రజ్ఞలా
ఎదురుగ నిలబడి ఎరుకజెప్పే గురువు
పగటీలి అలసి సొలసిన పిల్లలకు
అలసట తీర్సి అన్నం పెట్టె అమ్మ

ఆ బోధి వృక్షం ఒక సిద్దార్థునికే బుద్ధినిచ్చింది
ఈ వేపచెట్టు మా వూరి పిల్లలందరికి శిక్షణనిచ్చింది
కోసారు కొమ్మల్ల ఐక్య కార్యాచరులు
ఎవ్వరు కట్టారో నెత్తిన
ఎగుర్తున్న జెండాను ఎత్తుకొనే వుంది

చైతన్య సముద్రపు ఆటుపోటుల గాలులతో
పోటెత్తిన పోరగాండ్ల పోరుకు సిద్ధం జేసి
పాటల పల్లవులూది పౌరుషాన్ని ఉసిగొల్పి
ఎకాఎకిన ? ఏమాయె ఈ చెట్టుకు ?
బూరు పీకిన కోడోలె బోడిదై
అంపశయ్య మీద కొన ఊపిరితో కొట్టుకుంటుంది
ఆకుల్లా రాలుతున్న అమరుల శవాలకు
వేపచెట్టు తనువంతా తల్లడిల్లి
ఎండిపోయిన తల్లివేర్లలో
రేపటి స్వప్నాలను వెతుక్కుంటుంది.

(మా స్కూల్ ముందున్న వేప చెట్టు ఎండిపోవడం చూసి ...)

28.07.2010

## ఒకే ప్రపంచం - ఒకే కల

జౌగ సారెడు మట్టిముద్ద
మట్టి రేణువుల సుట్టిర్కం

భూమి నరాల పొరల కల పుట్టువడి
సావు పుట్టుకల పోట్రాయి

ఖండ ఖండాల కలివిడి
గెట్టులేని పంచ భూతాలుకు
పార్శ్వాల పట్టింపుల్ల
గాయగత్తర్ల గాలం

అక్షాంశ రేఖాంశాలొక్కటై
భూదిగంతాల కల
భూబంతి పైకెత్తే ఆట అనుగావాలె !

ఆయుధం ఒక భయం
ఆట అమర మట్టి శ్వాస
ఆటంటె దుక్కాల సోయిదప్పిన గుర్రు కాదు
అచేతన మనిషి తండ్లాడె జీర

ఒకే ప్రపంచం ఒకే కల
నైలు నరాల పోగు
టైగ్రిస్, యూఫ్రటిస్, అమెజాన్
ఓల్గా ఒంట్రు మట్టి



తడి పాదాల తవ్విన సంస్కృతి
సింధూ సభ్యత ....
హొయాంగొహో వడిగట్టిన దుక్కాన్ని
సముద్రపోటుల గడ్డకు
గవ్వల నట్టల కశికెల
కళేబరాల పునాదుల్ల జీవ పుట్టుకల
పురుడు పోసుకున్న ప్రపంచ కల
మొగులంత సాందిరి
భూమంత ఆటలు

కుంటెనగాని అణ్వస్త్రాల కాటుకు
తెగిన జీవాల రగుతపు ఎరుక
ఐదు ఖండాలెత్తుకొన్న శాంతి జెండా
ప్రేమ, కరుణ, ఆత్మీయతల
అటలమైన ఆట
ఒకే ప్రపంచం ఒకే కల

*బీజింగ్ ఒలంపిక్స్ క్రీడలు, తేది: 10-08-2008.*

## ఖండిత శిరస్సు

మందల గూసున్న బొందల దాకున్న
తల్లి శీలాన్ని కత్తికో ఖండగా కోసిన
రక్తపు మడుగులో గడ్డ కట్టిన
తల్లి పేగులోని బొడ్దూసిన ప్రేమ
వాత్సల్యంగా కొడుకు బుగ్గలను నిమురుత్నే వుంటది

ఉంగా ... ఉంగా ... ఊకో .. కొడుక
చనుపాలు తాగి చల్లగ బతుకు
కాదు ... కాదు కొడుకు నెత్తురుతాగే ఉన్మాది
పట్టపగలు నడి బజారులో
కన్న తల్లిని కతికోనోలె నరకగలడు

తల్లి ...
బండ మీద సిరిదేవోలే పొర్రి
పచ్చానాకు పట్టుకొని పమానం చేసి
భగవంతుని మీద బాస చేసిన
గవ్వలసొంటి పండ్లు తొర్రి మువ్వలైసిట్లి
బొక్కి నోరుతో బోర్లపడ్డ
బాణామతి, చేతబడి ... మంత్రగత్తె
ఈమెను బహిష్కారణ చేయవల్సిందే
బహిరంగంగ సంపవల్సిందే !



కృష్ణ, గోదావరి, గంగ, యమున
జీవదారలు చిమ్మె / ఆమె ముకాన్ని యాసిడ్‌తో కడగాల్సిందే
నిప్పులాంటి నిజం తెల్సుకొని సిగ్గు పడాల్సిందే

నిండు మయసభల సాక్షిగా
లోకం బదునామ్ చేసిన పుచ్చిన పుండు
తల్లి భగ్న హృదయం ...
శవమై నిరుదోషినిగా నిల్వసిందే !
సిల్లి - డొల్లిన నెత్తురు గుంటల
పొంగిన దుఃఖంలో అమ్మను చూస్తే
అప్పుడే ...
అగ్గి గుండంల నడుస్తోన్న సీతమ్మల
చౌరస్తాలో అమ్మబడ్డ చంద్రమతిల
పర్శరాముని గండ్ర గొడ్డలికి తలతెగిన ఎల్లమ్మల
సైదులు నరికి సైకిల్‌కు వేలాడుతున్న సత్తెమ్మ తలగ
వీపు మీద మూడ రాతలతో
ముక్కు చెవులు గోసుకున్న
అరవై నాలుగేండ్ల భారతిల వుంది.

*తేది: 15-10-2010.*

## ఎముకల గూడు

మూట గట్టిన ఎముకల గూడు
మ్యూజియంలో పెట్టుకోవచ్చు

రడామండల రక్త తర్పణం
చెమటచుక్కలా కారుతుంటే
పాపుల భారాన్ని భుజాన మోసే
తునాతునకలైన శరీరం

పరీక్ష నాళికలో ప్రయోగ వస్తువు
పిడికిలెత్తుకొని మొలిసే విత్తనం

బల్లిపాతర చక్రబంధం ...
అప్పుల విషంలో నిండ మునిగి
కత్తికి దిగిన మాంసపు ముద్ద

అయేటి వాన ఆరుద్ర పురుగోలె
మట్టి కమ్మదనం ఎండలో ఎండి
విలవిలలాడే కన్నతల్లి కడుపు శోకం

సమూహాల ఆశలపై
ఒంటరి జీవన పోరాటశీలి
పంట కారు కారుకు కడగండ్ల
తిర్యక్ తరంగ దుక్కపు మత్తడి

పాలెను నిలిపె పాదుకఱ్ఱు సాలల్ల
బురదను పిసికి బువ్వపెట్టె అన్నదాత

పత్తి పువ్వుల విచ్చుకున్న శీలానికి
చీరెతో సిగ్గు నిలిపిన వాడు



ఎండిన ఇసుక మేటల మీద
కొడి జివునంతో కొట్టుకాడే లొట్ట పిట్ట

ఎరువుల బస్తాలకు ఎగబడి
కాళ్ల కింద తొక్కబడుతున్న వాని
పట్టుకొండి .. పట్టుకొండి ...
ప్రయోగానికి పనికొత్తాడు
బతికుండగానే శవపరీక్ష చేయండి
లేదంటే బతికిపోతాడు
వాడు మిగులితే మీ రాజ్యానికి మంచిది కాదు
నిరంతరం పిండండి
పిండుడు మానితే పాలదార ఎండిపోతది
రక్త ధారలు వచ్చే వరకు పిండు
పచ్చి మాంసం పలుచబడి పారే వరకు
తడి ఆరే వరకు తనువు ఎండే వరకు

శీకేసిన బొక్కల గూడును
శిలుకొయ్యకు తగిలెయ్
రాబోయే తరానికి రైతే రాజని
పాఠ్యాంశాల్లో ప్రచురించు

ఇనుప రంపంతో కోసే సవ్వడి
కోర పండ్లతో కొరికే రువ్వడి
బొక్కలు చూరా చూరై
బూడిదగా మారే వరకు
రాజ్య హింస నడవని

నడివూళ్లే గాంధీ బొమ్మ సాక్షిగా
పంచుతున్న చెక్కులు
ముక్కలు ముక్కలైన
రైతు జీవితాల పోస్టుమార్టం రిపోర్టులు.

*తేది: 04-09-2008.*

## లంద ఎర్రని పొద్దుపొడ

లంద ఎర్రని పొద్దుపొడ
తిత్తులదాతి వృత్తుల ఇరుసు

గొంతు ఊగులాడే జిట్టి తలకాయ
పునాది లొకారం పంతబడె పాదం

జొబ్బన ఈగల జబ్బన ఆకలి
గట్కల పిండి రొట్టెముక్క ....
'పంచ' గద్ద పలారం జీవితం
కార్జెం కత్తి తునక
కమిలిన డొక్కల కలిగంజి
ఊగులాడే తస్సల దండెం
ఉండజుట్టిన ఆశ ...

సాగె కరవు సాగ మట్టనార
ఎదురునిల్చిన గాట్ల, ఎడమ చూపుడు వేలు
చెదరని సాక్ష్యం చెప్పచ్చురాయి
తలవంచిన శతకిరీటం
మట్టి పాదాల శణార్థి

ఈతనారజీరే ఇగురం
దొబ్బల దొంతుల అమృత గోర్జెం

పగిలిన కుండంచుకు ... 'పత్ర' పల్లవి నాదం
నరాల సప్తస్వరాలు, సూరుకు వేలాడే తాంబుర్రలు
జోగు జమిడికే ఒగ్గు డమరుకం



తోలు రక్త గల్జులనొల్చిన రోకలి పోటు పట్టు
సున్నం తంగేడు, కవుసు వొలిచిన కాగితపు అట్ట
పిడిశెల కుదురు సింతగింజ అంబలి
నారాతాల్ల నడుమల ఇసుర్రాయి బరువు

సకల వాయిద్యాల సరస్వతి, లందలో దాగిన ఆదిశక్తి
జల్లెడ తూట్ల నీటిమూట, పలుగురాళ్ళ పరమాన్నం

అదిగో ... అరుందతి ...!
కుండల ఉడికిన కుల మహారాణి
నీతి నియమాల తీర్పు

సప్త సముద్రాలు, నా అందె బుర్రల నీళ్లే ...!
అన్ని విద్దెలు ... నా జమ్మి ఇత్తార్లే ...!

భూమికి మొదలు పుట్టినోన్ని, భూదేవంత ఓపిక
మొగులంత ఇమరాస, సముద్రపు గంభీరం

పంచభూతాలు, నా పందీట్ల బందీలు
జాతీయపక్షి అంశ, కొసముక్కు కొంగవాలు కత్తి
జంబు రాజ్యలక్ష్మిని "మహా" దిగంతాల పాలకుని

*కైతునకల దండెం, మాదిగ కవిత్వం, 2008.*

## అలుకల చెప్పులు

భూమంటు పాయని
బువ్వపెట్టె సార్గం
హిమ్మత్ హతియారే
శ్రమే పెట్టుబడి

సచ్చిన పశువుల సద్దమాలక
వీపున కావడి మోసె కర్తవ్యం
అక్కరకు రాని ఆయసాయాల
ఇకమత్ ఇస్తెమాల్

ఆరె రంపెతో చర్మని
అనువుగా విడిపించె కారగిరి
లందల సొరెమారు చెక్కలు ఉత్కిన శెల్ల
తోలును పార కట్టెతో మడత సఫాయి దీసి
పని గూటం గుద్దిన శీరుకకు
మడిమె కుదిరెల మరోదిద్దు కుట్టు సృష్టి

అచ్చొట్ట చుట్టు అదిమిన కొంకెలు
క్రైమనగ దిద్దిన నునుపు
నగాచి తీనెల మోదుగ పీటమీద
మొరిజాల మ్యాకపిల్ల తోలు అల్కజడల్లల్లి
చెవు గూడల కమ్మ మొగ్గపూసల
మూకవారు ఉంగుటం కిర్రు చెప్పుకు



సిగపువ్వుల కుప్పె సింగారిచ్చి
ఉత్త తోలు ముక్కల రాశుల మీద
అస్త్ర శస్త్రల శాస్త్రవేత్త

మంగులం పెంకల ఏగిన ఆముదాల
కసపిస కుదురల కవ్వం రోకలిపొట్లు
కుండల మసిలిన ఎసరుల్ల ... ఆముదం కాసి
భూర్ల కంచుడు బుడ్డిల ఎక్కొచ్చిన
నల్ల నువ్వుల నూనెల
తెల్లారబెట్టిన తేలుకొండి కాయాల
అంతుదొరకని అమర్చిన కిటుకు
పాదుకలతో పదనిసరాగలు పల్కించిన వాడు
పట్టాభిషిక్తుడై జంబూ దేశాన్ని పాలించినాడు

ఏపమాను కింద ఎండిన తోలు శీరుకకు
ఉప్పస లేకుండా ఊపిరూదె ...
అస్పతి లేని ఆశయ ఆభూషిని
భూతల్లి ముద్దాడి ఎదల
ఎడ బాయకుంట నిల్పుకున్నది

ఐదుజానల బెత్తడు తొండనికి
బొజ్జ మాసిక చేవుల బెజ్జంల తాటిపొట్టె
కుంటెన తాడు గజ్జెల కాని నడుమ
దండెడను సల్లగుత్తి ముడిగట్టి
అదురుమాకు దరి ఆసరతోని
కొమిరె సిమ్ములు పంతె కొక్కుల మీద
కందెన కట్టె దులానికి

గిర గిర దిరిగె - గిరుక మీద
నాగరికతనంత నడిపినోడు

'జోడు' కుద్మలకు చిట్టెల వారు
వలపట దాపట ఎడ్లకట్టి
అన్మతాల్లు అదిమిపట్టి
ఊ.. చల్ .. చల్ .. చల్ ..
ఓ .. ఓ .. ఓ .. ఆగు
మొదటి గల్మల మోటనీళ్లు

శెరి ... శెరి ... శెరి ...
ఇరాం లేకుండా ఇలనంత
చెమటతో తడిపిన కలలు
సందెనవడి బొక్కలు తేలిన బొండిగెను
కొంగ్రిగాడు కోరలతో కొర్కి సంపుతుండు
అంగట్లవాని ప్రతిభ నేడు
అడ్డికి పావుశెరు

కోమలి పాదాలకు ప్రేమగా కుట్టిన
అలుకల చెప్పులు మల్లి దేగ ముక్కులో
రక్తం కక్కి చచ్చినయి.

తేది: 15-09-2008.



## ఉనికి కోసమే పోరాటం

బిద్దలైన గుండెవక్కల
చిచ్చుబుడ్డి దుక్కం పూవు పూసింది

బొందల బొంద తవ్వితే
బొక్కలు తప్ప బంగారమెల్లుతదా ?
ఏ సంబురానికి పండుగ జరుపుకోను !

కాకరవత్తులు అంటిచ్చి
దీవంతలు ముట్టించపోతే
మునికాల్లమీద అంబాడిన
అయ్యవ్వల ఆకలి యాదికచ్చె

కటికచీకట్ల తలక్రింద లట్కాడే
గబ్బిలాల ఏర్రటికండ్ల సారల్ల
ఎలుగురేఖలు యిముడుతయా ?

గత వర్తమానాలు సమురులేని ఎక్కలేనాయె
బతుకంత చీకటేనాయె !
మా బొందల మీద రక్తంతో రాసిందే చరిత్ర

నిలువెడు సొరికెలు పూడ్చడానికే
పేదోడు జీవితమంతా దంచిపోత్తండు
వేర్లు పీకేసిన మొండి మొదల్లపైన
కొత్త చిగుర్లు వత్తయా ?

"పిట్టగూడొలే కుచ్చగట్టిన
పసిబిడ్డ మాడంటుదామంటేనే
పిత్తకంత నూనె లేదాయె
అరుగు మీద దీపాలెట్ల పెడ్తరు" ?

దోని తొర్రబోయిన పొట్టల్ల
నీల్లన్న నిండకపాయె
తీపిబెల్లాలెట్ల వండుతరు ?

"పేలుతున్న లక్ష్మిబాంబుల్ల
కాల్తున్న పైసల సోకానికి
చెవులు గడేలుబడ్డ అలికిరి"

ఊరికి ఎరుమంద్రం గుడిసె
ఎక్కెక్కి ఏడిసిన ఎనగర్ర
ఎన్నుబొక్కలు నల్లబడ్డయి
పట్నం బతకచ్చిన కిరాయిండ్లల్ల
మనసులు భంగపడ్డయి

"భూములు జాగలు వచ్చినయా
పైసలు పవలు హేచ్చినయా" ?
ఆకలి మీద గెలిసింద్ర
ఆత్మగౌరవంగా బతికింద్రా ?

పల్లెల్ల పట్నంల బీదోల్లది
నల్లమొకం బ్రతుకేనాయె !
"తీర్పాటంగా ఎట్ల కూసుందు
తియ్యటి పదాలెట్ల రాత్తు ?

ఏం మారిందని పండుగ !
మారుతున్న కాలంలో
జారుతున్న పాత పాకురేనాయె
బతుకు దిగుడుకు తుట్టెగట్టిన దరిద్రం

లచ్చిమే వుంటే ఎట్ల వత్తది ?
ఆందెముతోని ఇల్లలికిన
అమీరోని ఇండ్లల్ల కుంటిదై కూలబడ్డది

గరీబోనిది ...
ఆకలి కోసం, భూమి కోసం,
ఉనికి కోసమే పోరాటమేనాయె !

తేది: 08-11-2009.



## కౌసు పొత్తిల్ల కలం

వట్టి పుణ్యానికె కంటు జేసుటానికి
ముడ్డికి కండ్లొచ్చిన ముచ్చటగాదు
విచ్చిన్న ఊపిరితిత్తులు
శరీర అంగాలన్నింటికి గోరికట్టి
జీవితాన్ని గులాంజెయ్య
శత్రువు చేసిన గాయాలు
అందమైన ముకం మీద పచ్చిపుండు
తడతడ సలుపుతు చీము మీద పక్కు కట్టింది

ప్రసిద్దైన తల్లి కౌసు పొత్తిల్లల్ల
చాట్ల బొడ్డు గోసినప్పుడే ...
వడ్లగింజంత వర్ణం మెడ చుట్టు
ఉరితాడై బిగుసుకున్న తల్లి పేగు ...
సుకోజీ గానికి నన్ను తొక్కిన మురిపెం ...
పునాది దొంతుల సునామి కంపనం

మనువు వట వృక్ష వూడలు అడల్‌గా అల్లుకోని
ఎనుగేసిన ఎడెముల్లు కులం గొంతుల ఇరుక్కొని
బుగ ... బుగ పొంగిన అవమానాలు

గాయి ఎత్తినడ్సిన పలుగురాల్ల నెరుసు మీద
ఆకు రాయితో నూరి మిగ్గుపూసిన ఆయుధాలు

నడిన్యాతిరి నిగుతేల్సి నిప్పులో కాల్చిన ఇనుప కొనుకులు
అర్ పార్‌గా పెట్టిన చురుకలు

నిషిద్ధ వాడల భుజానేసుకొని మోస్తూ
పొలిమేర గాసేవాడు శవమై ....
చావుడప్పుతో ఊరి అవతలి కాట్ల కాల్తున్నదగడు ...

అక్షరాలు అగ్గి కణాలె కురిసి జీవిత నిజాలు రాస్తె
కండ్ల సలువ రాతలు కవిత్వ మౌతయంటరా?

మొకం జూసి పీటలేసె మోర్ధపుతనం నీ పుర్రె గుణమైతే
తూటుపోయిన బతుకు దుక్కపు వాన గైరువె వద్దా ?
ఎద పల్గినప్పుడు ఏడ్పందరిది ఒక్కటే కదా !
కత్తులు - దూసుకపోయిన లోతైన బాధల
బతకడం కోసం ...
మా గుడిసె మీద మీ జెండాలే కాదు
గధ గధ గాతబెట్టె కలాల్ని నిలబెడుతాం.

*తేది: 05-10-2010.*



## జులుం - దూప

రహస్య అణిచివేత
బలవంతంగా బొండిగె పిస్కుడు
చాతి మీద సావ గుద్దుడు
నన్ను పిస్కి చంపల్నన్న కుట్ర
నాల్కకు ఘన శూలలై వేలాడ్తున్నాయి
ఎవ్వడొచ్చిన యింతె రాజ్యం తీరంతే !
ఇది జులుం దూపంతే !

కూల్చడమే వాని గుణం, గనం
గండ్ర గొడ్డలితో తెగనర్కుతుండు
నా తలకాయ కొబ్బరికాయ వక్కలు
దొప్పల్ల పీకిన కనుగుడ్ల రక్తం ...
విజయ తిలకం దిద్దుకుంటడు
సిమ్మన చీకట్ల పిశాచోలే ...
పీర్నుకతింటాడు ...

అదే మోసం ...
గిర్రున గతమంత ఎనకకు తిరిగింది
నిజమే ...
వాడైన ... వీడైన శత్రువే ...
ఇప్పుడు వేటగాడు నావాడు ...
నాడైన ... నేడైన... వాని కుట్రతీరొక్కటె
నా ఏలే నా కంట్లో పొడుత్తంది
కంట్లో గర గర మంటలు
పాపమని ఎంగిలి రొమ్మును చీకనిత్తె
పాలోడై .. పామై .. పగబట్టిండు

రేవు నాలెంచి రెచ్చగొడ్తుండు
చీము నెత్తురు చచ్చి సిగ్గుతో తలదించుకొన్న
ఎన్నిసార్లు పానాలు పోయి రాలేదు
చచ్చి బతికినప్పుడల్ల ...
నా నొసటి మీద దురదృష్ట గీతలైనయ్ !
అరచెయ్యి మందం దండబడ్డ ఎద్దు ముడ్డోలే
ముకం మీద ముల్లు కట్టె పోట్లైనయ్ !
ఉమ్మడి హక్కులు వర్గీకరించుమంటే
కల్సుందమని ... కథలు చెప్పుతండ్రు
తాళంచెయి ముడ్డి కిందేస్కోని
కసిగా... కసి కసిగా ...
పొక్కలు తవ్వుతండ్రు ...
తవ్వు ... తవ్వు ... పొక్కలు తవ్వు
ఆఖరికి ఆ పొక్కలో పడతవ్
మట్టిని మింగ జూత్తె మన్నుల గల్తవ్
అహంకారంతో ఆకాశం మీదికి ఉంచుతావా ?
ఊము నీ ముకం మీదె పడుతది !

నేను సావుజంపుల సాతగానోన్నేమికాదు
ఏడేడు తరాలు ఎత్తుకున్నోన్ని
ఎత్తుసుడు నాకు లెక్కగాదు
తొడగొట్టి పడగొట్టినందుకే కదా !
రాజువై రాజ్యాన్ని ఎలుత్తనవ్

నన్ను పాతిపెట్ట చూత్తె
బొంద పెట్టిన మట్టి నుంచి
మల్ల మొనదేలిన కత్తినై మొలకెత్తుత
మరణించి ప్రతిసారి సూర్యుడినై ఉదయిస్తా.
కొత్త కవితనై - బతికొత్త.

తేది: 05-10-2009.



## పొన్న పువ్వుల దుక్కం

ఆశల ఉట్టి అమాంతం తెగి
ఒంటి పురి మీద ఊగులాడే
సద్దన్నపు ముద్ద కోసం
సావు గంజిలో దేవులాడే
అన్నం మెతుకువయి
అవ్వ కుచ్చుల కుచ్చుల జెడలేసి
కులాభిమానాల్ని రగిలించిన నాడే
గడ్డకట్టిన పౌరుషాన్ని గళంలో నింపుకొని
ఆత్మగౌరవ గొంతైనవ్ !

అయ్య నాకు కాదు ...
మన జాతికి సూపునియ్ అన్నప్పుడే
నల్లబొగ్గువై తగలబడ్డవ్ !
చెల్లె "బుక్క' ' కోసం బక్కదైన్నాడే
ఆకలిమంట రాజేసుకొని అన్నవైనవ్

అన్న సరేందర్ మాదిగ ...
పొన్న పువ్వుల దుక్కపు రెమ్మవై
కన్నతల్లి కడుపుల పేగు కోసుకున్నవ్ !
జారిపడ్డ అమ్మతనం మమతల
అగ్గిల ప్రతిబింభమై నిలబడ్డవ్
నల్లని కనుపాపల్ల జాతి కలలను మోసుకొని

నిపుకల సెగలో చెటెల్లున చిల్లిన
వెలుతురు రవ్వయినవ్

ఉదయించే సూర్యుడి నొసటి మీద
ఎర్రటి నెత్తుటి ముద్ద బొబ్బవై
చంద్రుని చెంపపై నవ్వుల జిట్టి సుక్కవై
నీలాకాశంలో నిరంతం వెలిగే
అరుంధతి నక్షత్రమయినవ్

మాడిన మక్క కంకోలె
మాదిగల నోట్ల గింజవై
శరీరమంతా కాలినా చెదరని నీ లక్ష్యం
ఎబిసిడిలు అవుతాయా ? అని ప్రశ్నిస్తే ... !
పుర్రె పటేల్‌న పల్గి ... ఆలోచనలు విచ్ఛిన్నం

పొద్దుగాల్ల పొద్దుగాల్ల పొన్న పువ్వుల్ల
నిన్ను జూసుకుంటాం
మా గుండెల్లో దాసుకుంటాం
మాదిగ డప్పు నాధాలమై
ఉద్యమానికి ఊపిరులమై
హక్కులు సాధించుకుంటాం.

<u>మాదిగపొద్దు కవితా సంకలనం</u>



## అగ్గిపువ్వు

సిగ్గుతో రెక్కలు విప్పుకుంటున్న ఆకాశం కింద
దుక్కపు కన్నీళ్లను టపటపా రాలుస్తూ
గురు పాదాలకు గురుదక్షణిస్తున్నట్టు
ఏక్‌తార ఎండిన తంత్రుల వాయిస్తూ ...
అలిసిన పాదాల చీలమండల నుండి
రాలిన అందెల రాగస్వరమందుకున్నది మీరాబాయి

... హే ... జోగి నన్ను వదిలి వెళ్లిపోకు
నీ పాద రెమ్మలలోని జ్ఞానాన్ని
తుమ్మెదనై త్రాగటానికి భ్రమిస్తున్నా ...
వాడిపోకు, ఎండిపోకు, ఎడబాసిపోకు
చివరకు శేషంగా మిగిలిన నీ చితాభస్మం
దుర్మార్గపు వ్యవస్థపై సుడిగాలై చుట్టుకోని

జంజీరం లేని వాడు గురువెట్లైతడు ?
రాజద్రోహ నేరం మోపి షడ్ యంత్రంలో
బంధించిన దగాకోరు పండితులు
దారంతో వేసుకున్న జంజీరం కన్నా
గుండెలోతుల్లో బంగారు జ్ఞాన దారాన్ని
దాసుకున్న వాన్ని అన్నప్పుడు ...

రభి కటార్‌తో చాతిని చీల్చిన
చిత్తోడ్‌ఘడ్ రాణా విక్రమ్‌సింగ్ దర్బార్‌లో
అచేతనమూర్తివై జీవంలేని శిల్పంలా సచ్చిపో ...

సచ్చిపో ... గురురవిదాస్ ... సచ్చిపో ...
శూద్రుడివై జన్మించి పసిపాపవై పాలుతాగనప్పుడు
రామానందుడు చెవిలో ఊదిన రామమంత్రం స్మరించుకో
మోసపు చరిత్ర దారిపొడవునా వధించబడి
రక్తహస్తాలతో ... రాక్షసులుగా చిత్రించబడిన
నీ పూర్వీకుల ... పోరాటాలు యాది జేసుకో ...

... హే ... గురురవిదాస్ ...
అప్పుడు పారిన నీ నెత్తురంతా ఏరులై
ఇప్పుడు నా కలం నుండి కవిత పాదాలై నిలువనీ
చార్వాహకున్ని సజీవంగా కాల్చిన
కాష్టం నుండి నిప్పు కణ అక్షరమై ప్రశ్నించు ?

నాగుల రక్తంతో హోళీ ఆడిన
పెదాలపై తడారని కోపాన్ని
ఈ చరిత్ర జిట్టి బొమ్మ మీద
పిచ్చిగీతల తెర తీసెయ్ ...

మానవ హక్కుల పోరాటంలో ...
మౌన వృక్ష కాండాల నుండి తొడిమెలేని
పండోలె తుస్కున తెగిన తలకాయలు
మా తల్లుల మెడల్లో పుర్రెల దండలై



పూజలందుకోవడం ఏమిటి ?

శంభుకుని తలకిందులైన తపస్సు కోట గుమ్మానికి
జ్ఞానం బూడిది గుమ్మడి కాయ కాయడం
ద్రోహి ఆచార్యుని వైదిక నాల్కకు దిగిన బాణం
ఏకలవ్యుని వేలును దానమడగటం
తలవండు పాతరేసిన పాదాల మూలల కింద
బలిదానత్వం లజ్జతో చావడమేమిటి ?
మహాసముద్రాల ఆదెరువుగా మత్స్యమై ...
సోమకుని సొత్తును మింగిన యుగాది ఏమిటి ?

పశుల కంటే హీనంగా భిక్షువుల ముక్కలకు
సిక్కాలేసి రథాలకు కట్టి చంపడం
ఆగమైన బౌద్ధబిడ్డల ! అంటరానోళ్ల చేయటం
నిద్రిస్తున్న బృహద్రతున్ని తల నరికి
పుష్యమిత్ర శృంగులై ఏలటం ...
నౌ గజాల నిలువెడు పీర్ల (వీర్ల)
అసోయి దులలాడి ... అలాల్ చేయటం
శ్రమ జీవుల శిరస్సులన్నీ
బ్రాహ్మణ చేతుల్లో బంతులవ్వటం ఏమిటని ?
అంటరాని రక్తం నుండి పుట్టి - పదమే రక్తమైన
అగ్గిపువ్వుల అక్షరానివై జ్వలిస్తూ ...
రాజపురవీధుల్లో ఓడిన బ్రాహ్మణుల భుజాల మీద
మోయబడిన నీ ప్రతిభా యాదుజేసుకో ...

నీటి అలల మీద దేవత విగ్రహాల కాదు ...
చెప్పులు చేసే పనిరాయిని తెప్పలా తేలిపిచ్చిన
సహజమార్గ సమతా మిషన్ యాదు జేసుకో ...

... హే ... జోగి గురు రైదాసు ...
భగవాన్ బుద్ధుని కబీర్‌దాస్ మార్గంలో
సంఘ సంస్పర్శ సమరశీల వారసుడవై
బౌద్ధ ధర్మ మహా బోధి వృక్షపు కొమ్మకు
ప్రజ్ఞా రైవంత్‌వై పూసిన అగ్గిపువ్వా !
ప్రజా కవిని ఏనాడు పాలకుడు మెచ్చడు !
అగ్గికి ఆహుతైపోయిన నీ సాహిత్యం సాక్షిగా
ప్రజల గుండెల్లో ప్రవహించే నీ అక్షరం
చిత్తోడ్‌ఘడ్ కోటల్లో స్మారక
చెత్రి మీద చెరగని పాదముద్రలు
చీకటిని దులుపుకుంటున్న నీ జాతి కండ్లు.

తేది: 07-04-2010.



## హక్కుల జెండా

రాజ్యఖడ్గ చాలనానికి
రక్తపుటేరులో పేగు అవిసి
మరణాలు మొలకెత్తినప్పుడు
అగత్‌కు హక్కుల సూర్యుడు
మంకు మట్టితో మట్టి శ్వాసలు నింపి
గాయాల మీద నల్లాలపు పూతై
దండెగొట్టు దళారి పైడికంటెల గుండెపై
ఇరాంలేక పొడిసె కొంకల పొతంజేసి
విలువల విత్తనాలు అలికి
చెమట పిసికారిగా ...
మానవ హక్కులు పండించే
వాడిపోయిన గతిమల్లె బ్రతుకుబాటల
రికాంలేని ఉద్యమ వెలుగు స్మృతిగా అమిరి
జవగా హక్కుల జెండాలను నాటిన
ఆ సూర్యుడు అస్తమించాడని ఎవ్వరన్నారు ?
పొద్దుగూకుడంటే రేపటి పొద్దు పొడుపుకు ఎరుక !
స్వేచ్ఛగా పీల్చే గాలిలో
త్రాగే ప్రతి నీటిబొట్టులో
బుక్క బుక్కకు వీరుని జ్ఞాపకాల లంకె
గుండెలలో ముడిపడ్డది.

*ప్రొ॥ బాలగోపాల్ గారి మృతికి సంతాపంగా, తేది: 10-10-2009.*

## పచ్చలైన కంచు జెగ్గు

గౌడ మోకు ముత్తాదు గుజికట్టి
ఆకాశం మీద సెలిమెజల్లే గొంతు
పండుతాటి కల్లు తియ్యదనాన్ని
దోసిట్లకు తాగిపించే చేతుల్నే కాదు
పాటల పసుపు బండార్ని వొంటికి పూసుకొని ఆటలాడే పాలపిట్ట

నడుముకు చుట్టిన 'ఓణీ'తో అర్ధనారీశ్వర అవతారై శిగమెత్తే రాగం
నరనరాన మూలవాగు అలల పల్లవుల్ని నెత్తిన ఒగ్గుకథ నెత్తుకొని
వొద్దాకు కాగితం కట్ట - కలువదారి పుల్ల మద్దాకు మారుత్తరమై
చెట్టు-గుట్ట-పుట్ట-కట్టె-ప్రకృతి పాఠాలు నేర్చి
పల్లెల మీద పాటల జల్లువై కుర్సిన అ,ఆ లు రాని అనామక గొంతే
నవరసాలను నాల్కతో అవలీలగా పల్కించే
జనమనోపల్కపై మహాకావ్యాలు రాసింది

మానేటి గడ్డ-మముగన్న తల్లి బుద్ధి చెప్పిన భూదేవి
హన్మాజీపేట నుంచి అంతర్జాతీయ కీర్తి ...
లస్మయ్య, ఎల్లవ్వ, 'తీగ' మల్లెకు పూసిన పువ్వు వాడిపోయింది
'మిద్దె' లోపల లొద్దిల అల్లుకున్న జనపదాల
శ్రావ్యమైన గొంతు ఎండిన ఆకోలె రాలిపోయింది

ఆ పాట కంచు జెగ్గుల మోత
ఆ ఆట ఎములాడ రాజన్న కాలి అందెల సవ్వడికి



చిగురుటాకులా స్పందించి శరీరమై
ఒగ్గు గానమైన నిలువెత్తు శిల్పం

కత్తికి ఒక్కవైపే పదును
అతని అణువణువు పదునెక్కిన పాట
కఠిన హృదయాలను సైతం కరిగించింది

నాగుపాము నడికట్టు - తాసుపాము తలకట్టు
చిన్న చిన్న పాములు చిటికె నేల్ల ఉంగరాలు
వీపున వింజామర నొసట శిత్రకన్ను
గావు పిల్లలు- ఘటం కుండలు - జిట్టి కుంభాలు
పంచ రంగుల పట్నమేసి ఎల్లమ్మకు సిద్దోగం చేసే
డోలు - తాళం - జగ్గు - కంజీర - మూగ వోయినయి
నెత్తినెత్తుకొన్న సచ్చాన బొనం పచ్చలై
లందగోలెం మీద ఎల్లవ్వ తల్లి కండ్లల్ల
ఎతలవూట ఊరు కత్తంది

జ్ఞానపీఠం మట్టిపొత్తిల్ల విచ్చుకున్న పుట్ట బంగారం
దేవుని అర్రల ఎల్లవ్వ తల్లి గద్దె మీద
ఏడంతురాల బోనం మీది దీపంతల దీపమై వెల్గుతుంది
గుగ్గిలం - మై సాక్షి - సువాసనలై
ఊరూరా పొలిమేరగాసే పోతలింగడై
ఆ పాట ప్రజల నాలుక మీద కావలుంటది.

ఆంధ్రజ్యోతి వివిధ తేది: 29-11-2010

## హక్కులకన్న వీరుడు

నూతన సంవత్సరమా శుభాకాంక్షలు
విరోధై పేదల త్రిమూర్తుల పాపుకపోయిన
వికృతమా దుక్కపు వీడ్కోలు

నిటారుగా నిలబడ్డ మనిషి వేర్లను
తెల్ల ఎలుక - నల్ల ఎలుక తెగకొర్కుతు
ఆరుకాల్లు పన్నెండు తలల వింత మృగం
మహా వృక్షాన్ని కూల దోస్తుంది

తేనె తెట్టు నుండి కారె ... మధువు కోసం
కామంతో కండ్లు మూసుకపోయి ...
ఆశల ఊభిలో దిగబడుతున్న మానవుడా !
Always remember
Things are to be used &
Peoples are to be loved

వస్తు వ్యామోహంలో - వొల్లుమర్చి
నిరంతరం మోసాలతో జీవిస్తున్నవాడ
నిరాడంబరంగా అమరులైన మహనీయులు
ఒక్కసారి స్మరించుకో ... !



నిత్యం చావుకు ఎదురు నిలబడి
కత్తులు దిగిన గొంతుల నుండి
నెత్తురు ప్రవహిస్తున్నప్పుడు
ఈ నేలంత తడి తడి మరకలు ఆరకముందే
హృదయం దగ్ధమైన కమురు వాసన
గుప్పుగుప్పున రగులుకొన్నప్పుడు
పల్లె జీవాల వెంట, రాళ్ల రప్పల వెంట
అడవుల్ల బర్రెంక చెట్ల కింద బిడ్డల శవాలు
కుల్లి-కుల్లి-లుక-లుక పురుగులు పట్టి
కనుగుడ్లను పీక్కతిన్న గండు చీమలు
సందమామ ముఖాన్ని
చీకటి జెడలీరబోస్తున్న కరవాలం
ఆనవాల్లు లేకుండా చెక్కినప్పుడు
మంచినీళ్ల బాయిల్లో గ్యాసు నూనె కల్పి
నోటికాడి కూడుల మన్ను పోసి
మానాలు దోసి - పానాలు దీసినప్పుడు
కడుపు కాలీన దుక్కంతో ...
ముండ్ల కంపల మీద
చిల్లులు పడ్డ హక్కుల జెండాను
కన్నబిడ్డోలే సంకకెత్తుకొని
పగబట్టిన పాముల నాలుకల మీద
కొర్రాయి సురుకులు పెట్టిన మట్టిగొంతు

బల్లున పొడిసె సూర్యుని
పిడికిట్ల బంధించలేవ్
అధికారంతో అన్ని జయించలేవ్
చట్టాలు ఎవ్వని చుట్టాలు కావని
మానవ హక్కుల పరిరక్షణను
భుజానెత్తుకొన్న యోధుడా !
ఆభాగ్యాల ఆపద్బాంధవునివై
ఆదుకొన్న వీరుడా !
జోహార్లు... జోహార్లు... జోహార్లు...
నా చావును ప్రచారం - చెయ్యొద్దని
వీలునామ రాసిన
నీవులేని ఇల్లు నిట్టాడు కూలిన గుడిసె
నీవు లేని వూరు దేవుడు లేని జాతరే.

*తేది: 31-12-2010, కన్నాభిరాన్ గార్కి జోహార్లు.*



## జబ్బవిరిసి నిలబడ్డ నిబ్బరం

అపరిచిత నేత్రాలేవో
కుసం విడిచిన కొదమ పోరని
మెదడును గిలకొట్టి
మైలను సాపుచేసే రెండు చేతులు
సమాజ కుళ్ళును నరికే కత్తులు చేసినయి

ఒహొం ... ఒహొం... హొం... ఒహొం ఒహొం అని
పల్లికి మోసే భుజం
జబ్బ విరిసి నిలబడ్డ నిబ్బరం
నెత్తిన ముట్టించుకొన్న కందీల
చేతి వేళ్ళకు అంటిచ్చుకొన్న దీటీలే
కేంద్ర నక్షత్ర కాంతి వలయాలై
దొర కచ్చురం ముందు పరుగెత్తిన గులాంగిరి
జ్వలిస్తూ ... జ్వలిస్తూ ... జ్ఞాన పరిమళాన్ని
అస్పర్శ కరాలకు అక్షరాలంటిచ్చినయి
'అయ్యా ... సాకల్దాన్నని'... అర్థించి
కులం బోనులో సింహాలై గర్జించి
మట్టమీద మైలంటని మడి పంచెదున్నల
బండకు సరిసి ఉత్కి మమతల మల్లెలను మడిసిచ్చి
కాలు, తలకాయ ఖలాల్‌కు కలబడె
మూలాలను పసిగట్టి శూలాలై చూస్తూ
అంటరాని జాతుల అస్తిత్వ గొంతు

నిరసనల కర్రె సూర్యుడు ...

ఈసడింపబడిన కులాలకు ఇంగ్లీషు సౌరభాల్ని
ఆత్మవిశ్వాసంతో అద్దినవాడు
కట్టెలు విరిగి, తలలు పల్గి తూటాలు దిగి
వరదలై పారిన రక్తం చాకలి ఐలమ్మ పోరాటం
దొడ్డి కొమ్రన్న శూరత్వాన్ని
అణువణువనా నింపుకొని అగ్గి మండే
మడేల్ స్వామికి మరో ప్రతిరూపం

ప్రొఫెసర్ కేసరాజు కొమ్రన్న
నీ పెదాల మీద జారిపోతున్న నవ్వును
ఎర్రకోట మీద మన జెండగా ఎగురేస్తాం !
మూసిన నీ కంటి పాపల మీది
చెరగని స్వప్న ప్రతిబింబ చిత్రాలు
ఇతిహాసిక ధిక్కార పాఠాలు

అన్నా ! నీవు వదిలిన పోరాట లక్ష్యాలు
తొడగొట్టి బిగుస్తున్న స్వరాలు
రేపు వెలుగునివ్వటానికి అదృశ్యమౌతున్న
నల్లకాంతి రేఖలు !

<u>ఆంధ్రజ్యోతి వివిధ తేది: 30-08-2010</u>



## జమ్మి - అమ్ముల పొది

ఆత్మ బలిదానం ఫ్రేములో బిగించబడి
ఆ సింగం చరిత్ర అద్దంలో అంటరానిదై ఇముడలే !
జాతి పౌరుషాన్ని తలకెత్తుకున్న త్యాగం వ్యక్తిగతమని
రాజకీయ ఉద్దేశం లేనిదని తొక్కేసిన
దేశభక్తి పరిమళమంతా లందవాసనే

ఆదివారం వైశాఖ ప్రతిపద ఉగాది పర్వదినం
పంజాబ్ స్వర్ణమందిర అమృత సరస్సున స్నానమాడి
జలియన్‌వాలాబాగ్ జన సముద్రమై ఒడ్డొరిగింది

స్వేచ్ఛకోరే అలల మీద శాంతి పావురాలెగురుతున్న
ఆ గుంపు మీద అచానక్‌గా ఆంగ్ల రాబందు వాలింది
పదునైన గోళ్ళతో రక్కుతూ వాడి ముక్కుతో పొడుస్తూ
కర్కషంగా తుపాకి గుండ్లను
బుజ్జి బుజ్జి పావురాల గుండెల్లో దించుతంది
రక్తం మడుగులు కట్టి స్మశాన బీభత్సం

ఎటా జనపద సునాం ప్రాంత చమార్‌జాతి
జంబూగోత్ర అమ్ముల పొదిల పొదిగిన
జమ్మిచెట్టు కొమ్మ మీది కేలి
రౌద్రంగా దుంకింది కొదమ సింహం
ఎదురు నిలిచిన గుండెకు

ఎం(టుకవానిలో దూసుకుపోయిన గుండు
ఉడుకెక్కిన కోపంతో ...
రాలిన ఈకలన్నీ బాకులుగా ఏరుకొని
ఇనుప రాబందు గుండెల్లో ఈటెలుగా దించాలని
రక్తం కారుతున్న రక్తాన్ని రక్తంతో దునుమాడ
ఏడేడు సముద్రాల అవతల ఎక్కడ దాక్కున్నా
ఆకాశం, భూమి, నీరు, నిప్పు, గాలి సాక్షిగా
ప్రతీకారం తీర్చుకుంటానని ప్రతిన బూనింది

దిక్కు దీములేని ఆ పిలగానికి అనాథాశ్రయమే అడ్డ
పండిత్ జయచంద్ ప్రశిక్షణల
కండలు తిరిగిన ఆకర్షణీయ దేహం అందమైన ముఖం
సుశీలం, చురుకుదనం, కుశాగ్ర బుద్ధి
పట్టుదలే జీవితం జీవతమే పట్టుదలై
మల్లయోధునిగా ప్రత్యర్థుల మట్టికరిపించి
డప్పులు వాయించి, డ్రైవరై నడిచి
కార్మికుడై, కార్పెంటరై
ఆ ఫర్నీచర్ దుకాణమే
విప్లవకారుల అజ్ఞాత కేంద్రమయింది

ఊరూ పేరూ వేశం మార్చి లండన్ చేరి
ఆటో మోబైల్ ఇంజనీరింగ్ చదివి
ఆయుధాల తయారీలో ఆరితేరి భారత్ వచ్చి
క్రాంతికారులతో కదం కదం కలిపి
కాశ్మీర్‌లో ఫకీరు వేషంలో నిన్ను పసిగట్టి శత్రువులు
ముల్తాన్ జైల్లో ఐదేండ్లు బంధించినపుడు
ఉరితీయబడ్డ అమరున్ని యాజ్జేసి
"భాయీ ! భగత్‌సింగ్ !



నీవు మాతృభూమి కోసం త్యాగం చేసి
ప్రతిజ్ఞ పూర్తి చేసుకొన్నావు
ఇపుడు నా బలిదానం బాకీ వుంది"

స్వాతంత్ర్యం కొసం విలవిలలాడే విజయమే నీ కల
రాజాగ్రరాజ్యాలు, ఖండాలన్నీ కలెదిరిగి
కల సాకారం కోసం కసిగానే బతికి
పడవలో బొగ్గుగాల్చే కార్మికునివై
సముద్రపు దొంగలతో సహవాసం చేసినవ్
దుష్మన్ యింట్లో దూరి కారు డ్రైవరై
అడ్డొచ్చిన ప్రేమను అవలీలగా వదలుకొన్నవు

పంజాబ్ రక్షకుడు, పాపకారి, నరహంతకుడు
జనరల్ డయ్యర్ బక్కచిక్కి శిథిలమై
కృంగి, కృశించి కుక్క సావు వాడే సచ్చిండు

ఆనాటి అవమానాన్ని రోమరోమాన నిలుపుకొని
తెల్లదొరల మొకం మీద మళ్ళీ మళ్ళీ ఉమ్మి
ఇరవై ఒక్క సంవత్సరాల ప్రతీకారాగ్ని జ్వాలను
లండన్ కైక్సటన్ హాల్లో
మైకేల్ ఒడ్వియార్ గుండెల్లో తూటాలు దిగి
వాని ఇనుప నవ్వును ఇమ్మత్‌తో సంపి
దేశంగాని దేశం, రాజ్యంగాని రాజ్యం
రవి అస్తమించని బ్రిటీష్ గడ్డ మీద
ఉరితీయబడ్డ
ఉదయించే సూర్యుడివే ! ఊధమ్ సింగ్ వీరుడవే!!
నీ కోర మీసం నుండి రాలిపోతున్న శౌర్యాన్ని
మా వెన్నుపూసలకు దిగేసుకొని
జాతి చేతిలో ఆయుధాలుగా నిలబడుతాం.

ఊధమ్‌సింగ్ జయంతి : *26-12-2010.*

## అలల తడి

సాగర మంటె నీళ్ళే
నిజంగా నీళ్ళే
నీల్లులేకనె బతుకులు
నిత్తెం కొర్రాయోలె మండుడు
సముద్రం లేని కాడ
అడవే దిక్కవుడు

తదాగతుని తత్వాలు, అష్టాంగ మార్గాలు
కండ్లల్ల సుడులు తిరుగుతు
అలల తడి మీద సిద్దార్థుని ఆత్మ
అధర్మానికి దుక్కిస్తుంది
ప్రపంచములో ప్రజ్వరిల్లిన యిజం
భారతంలో పద్దతిగా పతనమయింది

ఒకటే బాణం ఒకటే మాటకు
తండ్రి మాటకై రాముడు అడవికెల్లితె
నాగజాతి నీటి వాటకై
గౌతమి పుత్రుడు రాజ్యం త్యజించిన నాడె
మోసపు పునాది నిర్మించబడ్డది
పాలసాగర మథనాన
పన్నిన పన్నాగమె నాగార్జు కొండలో
రాహువు కేతువై నడినెత్తిన ఎండ సురుకు



బుద్దుని పాదాలను బురుద తగలకుండ
సుమేరుడు తన శరీరాన్ని పరచినట్టు
తలమీద ప్రాజెక్టు కట్టి
నా మొకాన మట్టి కొట్టింద్రు

పద్మాసన బోధిసత్వుని తలలోని మెదడు తీసి
జ్ఞానాన్ని సమాధి చేసి
రాతి శిల్పాలను నిల్పింద్రు
పై మెరుగులు దిద్ది
పాదాల సంస్కృతి స్పృహ లేకుండా చేసింద్రు
తెగువారం చేసి అడుగుతున్నం
జగడం లేదు కొట్లాట లేదు
మారాజ్యం మావాట మాకు కావాలె
అమృతం కాకున్నా మాకిన్ని నీల్లు కావాలె.

*సృజన సంగమం, నాగార్జున సాగర్‌లో, తేది: 04-01-2009.*

## మమేకం

నెర్రలు పారిన బీడు పంట భూమి
పాడువడ్డ బతుకుల పాతర
చేతికందిన కొడుకులు చేరబోయి
కండ్లు ఎండిన చెరువు

డొక్కలెండుకపోయి దోర్లబడ్డ బక్కగొడ్లు
పిల్లకర్ర బిళ్లదూలం మీద గిర గిర దిరిగి
నీరుముంపు తొండపుతాడు తొండెం బొక్కినిండి
బొజర్లల ఎండిన నీటి కలలు

దోని చప్పుడె కాని దొయ్య పారలేదు
పడువాటు నీల్లులోలె పనికిరాని నదులు
పాలిపగతో తెలంగాణ దిగులు
మతపరించిన మన్నుల ఆత్మగౌరవము
నిండు చూలల నిళ్లకుండ ఇచ్చుకపోయి
పల్లె బతుకులు చెల్లాచెదురు
ఏ అవ్వను మందలించిన ఎతల కథలే
కడ్పుల దుక్కాని కొస కొంగుతో వడిగట్టి
ఆడపిల్లలె అయ్యకు తలకొరిపెట్టె
గల్ఫ్ గాలిలో లేసివచ్చె శవల పెట్టెలే
బతుకు సాక్ష్యాలు ...



పచ్చవాతమచ్చి పడిపోయిన పాలకులు
బోరెమోలె మొగడు చావంగ
బొంత సింపులకు ఏడ్చినట్టు
జాబ్‌మేళా జెంతర్ మంతర్
వంతకు దాశరి కాలడ్చినట్టు
పెన్షన్ పెంచినమని పెబ్బలు

దిమ్మదీర తాగుదామంతె దమ్ముకన్న దొరకని నీల్లు
ఇప్పుడు తెలంగాణ పల్లెలు
బాయికి కాడికిపోయె బజార్లలా
సందులేకుంట సర్కార్ తుమ్మలే !
డాంబర్ రోడ్లల్ని డాలర్ ఎండమావులే

బడుగు జీవితాలు బొక్కలుదేలిన అస్థి పంజరాలు
ఆత్మహత్యలతో శిథిలమౌతున్న ప్రాణాలు
కడుపులు నిండెదాక కట్టం తీరేదాక
పొలికేక లేసుడే పోరునడుపుడే
మట్టి మనుషుల మమేకం జేసుడే !

తేది: 05-10-2009.

## తెలంగాణ దరువు

మర్మం మార్మికతనే గదా మమ్మల్ని ముంచింది
గురిజూసి గుచ్చిన రాజదండం
తల్లి తెలంగాణ గుండెల దిగింది

మొదలు దొరకని పాసితీగోలె అల్లుకున్న కుతంత్రం
తిప్పతీగ తొక్కినట్టు తప్పిపోయిన తెలంగాణ జింక పిల్లలు
సహజ వనరుల క్షయీకరణ సంవేదన నాదం

నిండు చూలాల తోటబాయి ఒడ్డున
పచ్చని చెట్టుకొమ్మన పిట్టగూడు
స్వచ్ఛమైన పాలనీడల పిచ్చుకల ప్రేమలు
మర్రి తొర్రల్లో మత్తు తుమ్మెద పాట
కేపులొట్టి నిండి కారిన పోద్దాటి కల్లు చుక్కలు
దోసిళ్లతో తాగిన అమృత రుచి
కాట్రావుల కలకలతో జంగిడి ఆవుల మంద
కటిక పాదాల కళేభరాల గోసలు

నురగ తరగల పూసిన తంగేడు పువ్వు
మొగన్ని మింగిన మోయతుమ్మెద ఉసికె తెప్పలు
క్షౌర, కసరు బొత్తల, కచిర, కవుసు కుప్పలు
అద్దాల పరువు మేకల బండ



కంకర కుప్పలు, మట్టి దిబ్బలు
అత్యాచారానికి గురైన తల్లి ఆనవాలు

పచ్చని ప్రకృతి వృక్షాలు తలలు గొట్టిన లాలిచావులు
పట్నంలో ఫర్నిచర్ దుకాణాలు
పగబట్టి సంస్కృతిని కొల్లగొట్టిన పరాయీకరణను
దండెడపేనిన వేళ్ల సందుల చిర్రలే
చెర్నకోలలై తెలంగాణ దరువేస్తాయి
తుప్పు పట్టిన చన్నె ఆరెలే
మిగ్గుపూసుకొని దూసుకొచ్చే కవితా కత్తులౌతాయి
కుతకుత ఉడికే జనం
తెగబడి తెలంగాణ తెచ్చుకుంటాం

జమ్మిఆకు కవితా సంకలనం, 2008.

## ఔగోలిత్తన్నం...

ఇరిగిన బండి గీర విలవిల కొట్టుకుంట
మొండిగం మొట్టుకారు మీది మొర

చుట్ట, ఆరెలు, కమ్ములు, సొప్పబెండ్ల రథమోలె కూలి
కదలని చక్రాలకు కందెన జనుము కరువు

నొగ నొసట ముక్కెర సీల
అయ్యజచ్చిన అవ్వ మొకము

కడప, గుజ్జులు, పిడారి ర్యాకలు
ఎడ్లకొట్టం అటుక్కు
చెక్కుడు పిన్నె రాగోల
దూలం పొనుక తానాలకు సాటు తడక

యాతం సీడే శేడెకు
గడ్డి యెంటి మట్టి తూకం
గైకి బొమ్మ చెక్కల బొక్కెన సీల
గుండ్రాయి గుంటల మాసికం

రాలగొట్టిన పజ్జొన్న కంకి ...
ఊసకు బొండ వదలనట్టు
మనిషికి మతం మంకు
తలపువ్వు వేసే మక్క కర్రకు
సంకల పాపోలె కులం



కులవృత్తే నిచ్చెన మెట్టు
చేతిల అప్ప దేగ తన్నే
నోట్లె మన్నువడే ...
అయినా కులంబోలె, మనిషి చావలె

అయ్యో రాజ్యానా, అవ్వోతానా, కొడుకో ...
తీనకతెర్లు నవనాటకం
గాడుపు దుమారముల ఈతకమ్మల పతంగి
అన్నమో రామచంద్రయి ఔగోలిత్తన్నం

చూశారా ? చూశింద్రా ....
ఈ మధ్య నన్ను నా ఇండ్లను ...!
నాలుగు నల్లజెడల జూపుకున్న
బల్లి నోటికాడి పురుగుల ...
మొగోల్లే లేని ఆడగూడెం
ప్లాస్టర్ లేని పాతిటికెల సగం గోడలకు
ప్లాస్టిక్ బొంతల కప్పు
అవ్వ ఏడువంగా బిడ్డ వలపోశి
బడిబాట తొక్కని అడుగు
ఇన్ఫర్మేషన్ టెక్నాలజి అంజిరంల
మాగి పొద్దుగూకుడు ...

తెలంగాణ కవిత, *2008.*

## దొరకకుంట పోండ్రి ...

రాలే చెట్లకు దీటీలు కాత్తే
రాజులు మెచ్చరు !
"అది కచ్చీరు కావురం"

గుడ్డి కొంగ గురి నాశడగాలానికే !
భాషయాసలు మెడల చెప్పుచీపుర్లై
వాట్ల మొకం మీద బేట్లు లేసినయా ?

పాపపు కండ్లు కూల ... !
అంగభంగం జేత్తరి గదరా !
నెత్తిన సల్ల బాండువా
ఎక్కడికక్కడ పచ్చులు జేత్తిరి
ఏగి లేత్తేనే బరిదెగిన బసికుక్కలా ?

అరచేతిల బెల్లం పెడితే
ఆరునెల్ల గురత్తముండాలే !
గొౖర గొౖర గుంజుకుంట
గోదలోలే కొట్టవడితిరి !

కడుపు కడుక్కున్న ఎడ్డి తల్లి
కండ్ల దుక్కాన్ని కడుపుకద్దుకొని
పదేల పబ్బతి పెట్టి
కాల్లు కడుపులు మొక్కితే
పండిన దొండ పండు దేహం !



పొర్లాడే గలుమల నెత్తిన దీపం
తెప్పల సాటు చుక్కల అందేశన !

మనుసు కుదిరితే కడుపు నిండది
మొకం జూత్తే పిల్లపుట్టది !
ముడిముడికాల కోరికంటవు
ముచ్చటి గుంపుల గుద్ది సంపుతవు !
సాటకు తవుడంటని
కనగంట పుట్టెడేడుపు !

"కట్టెలు వేరైనా కాల్చేది అగ్గే"
కడిగితేనే కయ్యం వొల్లిత్తెనే జవుడం
రగులుతేనే యుద్ధం ... !

పారేనీల్ల మీద దెబ్బతీత్తే
నీల్లు బాసిపోతయా !
కొట్టినోని తీటపానుడే

సూదుని ముల్లేగట్టరాదు, ఉద్యమాన్ని ఆపరాదు
మిరుగుల వర్షం ఎగజిమ్మే పొడిసేపొద్దు ఆగది !

ఊర్లన్ని ఉడుకుతన్నయి
ఉక్కు గొలుసులు చిక్కు గొళ్ళాలు
ఫల ఫల తెగుతున్నయి !
రాచబాటల గాదు !
దొడ్డిదారిల దొరకుంట పోండ్రి ...

*తెలంగాణ కవిత, 2009.*

## దుర్భిణి

సూటిగ సుక్కబొట్ల కొడితె
చాటంత పరుసుకున్న చరిత్ర
దరి దొరకని సితపతాలం లోతు

చేతితో ముట్టుకోక ... కసిగ ...
కాలుతో తొక్కబడె వాకిలి దేవర
యాస్ట బతుకుల రేషం పుట్టువడి
మాన-పానాలు పోయి పచ్చి గాయాల
ఎగిలివారేపొద్దు

రువ్వడిగా తలకెత్తుకున్న పౌరుషాన్ని
సిల సిల చిందేసె జాగిర్‌దారి పశుత్వానికి
పసిపాప తల్లనేనని ...
రొమ్ములను జువ్వగా పిండిన రోషాన్ని
కండ కండలుగా ఖండించిన మాంసపు సప్పల
గుమ్మడి ఆకుల మీద గుత్తులుగా చేర్చి
తనువంత వరుగులు వరుగులుగా తర్గి
కంచు తాంబాలంలా కచ్చులు కచ్చులుగా పేర్చి
బరివాతల తుపాకి బాయినెట్ కొసన
విచ్చుకున్న ఉద్దెరాశ పువ్వుల
ఉడుకు ఉడుకు కార్జాల గౌరమ్మను పెట్టి
పల్లె పల్లెకు గల్లి గల్లికి
కోటి బతుకమ్మలు ఆడుదాం ... రాంద్రి

రాంద్రి ... జర .. జెల్ది .. జెల్ది .. రాంద్రి ..
అడవంత తిరిగి చెట్టుకో తీరొక్క పువ్వుతెచ్చి
దొరసాని గడిల కుప్పలు పోసిన
ఊరి అవతలి బతుకులను గద్ద తన్నింది



కాకుల గూళ్లల్ల పీతిరి గద్దల పెత్తనం

మాటల మంత్రల తంత్రాలు నమ్మి
మత్తకొల్పిన మేకపిల్ల మైసవ్వ తల్లి
బలిదీసుకుంది
బలిగంప్పెత్తుకొని సర్వ్వజల్లుదాం రాంద్రి ...

కడుపు కాలి శిలుక్కొయ్య కూగులాడే పాత దప్పు
గుడిసె గోడకు గుండెలు బాదుకుంట పల్గిపోయింది
ముక్కలు ముక్కలైన గుండె మువ్వలు
కాళ్లకు గజ్జెలు కట్టి కవాత్‌జేద్దాం రాంద్రి ...

రాంద్రి ... జర .. జెల్ది .. జెల్ది .. రాంద్రి ..
పల్లె నడుమ మజీద్ ముంగట తలతెగిన పీరి
పకీరు చేతిల నెమలీకల కట్ట, ఊదుచిప్ప
అల్వామీది మైదాకు కొమ్మ సాక్షిగా
విషాద గీతాలాపన చేద్దాం ... రాంద్రి ...

నాల్గు బజార్లకాడ భగ భగ మండి ...
కాలిన వీరుని రెండు కండ్ల కుట్రల ...
ఎంకులాడె దుర్భినీల జెద్దాం రాంద్రి ...

సాలు సాలుకు సర్రున పారే చెమటను
వస్త్రగాలమేసి ఆశల చిప్పల
పొరిసి పెడితె బొండిగ తడవది
పాముల నమ్ముకున్న కప్పల గతి

కపట కొంగ బొండిగను కొర్కిన
ఎండ్రికాయలోలె, నిమ్నజాతులేకమై
పీటుకం లేకుంటా పీఠాలు కదులాలె
కొసరుకు కొట్లాట కాదు ...
అస్తిత్వ తెలంగాణ అధికార పీఠానికి ...
పోదాం రాంద్రి ...
రాంద్రి ... జర .. జెల్ది .. జెల్ది .. రాంద్రి ..

తేది: 01-11-2010.

## సావేర్పడదా !

శత్రువును కూడా ప్రేమిస్తది మట్టి
నమ్మకం నిట్టాడై నిలబడ్డప్పుడు
అడధర్మి చేసెటోన్నైనా మట్టి ...
ఆదమరచి గుండెలకు అలుముకుంటది

ఇక్కడ ...
మట్టిని వుట్టిగా ప్రేమించరు !
మట్టిని తల్లిగా పూజిస్తరు !

అట్లాంటి ...
తల్లినెత్తిన నెగడోలె ఆకలి
అమాస చీకట్ల ఆగి కాల్తంది
బతుకంత దుబ్బ కొట్లాడుతంది
దోసెడు గంజి దొప్పెడు బువ్వ
సొరెడు నీళ్లకు ... కాటగలిసి
చాట్లపడ్డ గీతోలె ... కాట్లె పడపోతంది

ఒరె ... అయ్యా ...
నీకు జన్మనిచ్చింది ఈ తల్లె
ఓరకుండుడాగి ఓకరింతలై
ఆకాశమంత ఆపతిపడి అమ్మయింది

నీరు నిచ్చింది నిప్పు నిచ్చింది నీడ నిచ్చింది
రక్తాన్ని చెమటగా మార్చి పాలనిచ్చింది
తన గుండెల మీద స్వేచ్ఛగా వుండనిచ్చింది
యాస భాష ఆశయాల ఆయుషు పోసింది

ఇట్లాంటి ...
మాతృ సమానమైన ఈ మట్టికి
నువ్వేం ... రుణపడి లేవా ?



అదేందిరా ... అయ్యా !
అట్ల మాయిల్లమే ఎల్తిపడ్తవ్
ఎద్దాపురమోలె ఎక్కిందా కావురం
నకమొకాలు నల్వాల పడవడితివి
నీ నకరాల నక్కజిత్తులు
దునియంత పూట్‌పూట్ అయినయి

అవునా ... !
అవ్వచేతి బువ్వ అశుద్ధమైందా ?
లంజ బోజనానికి లావు బంసుతున్నవ్
"పొగరెక్కిన కండ్లకు పొద్దేర్పడదట
సానిబ్రమల వడ్డోనికి సావేర్పడదట"

ఇగ ... మా సాలు గాని
ముళ్లును ముళ్లుతోనే దియ్యి
శత్రువుతో నిలబడి కలెబడటానికి బైలెల్లి
సాలుచింతల దాక సాగనంపినకాడ
వంగి దండంబెట్టి వచనమిచ్చింది వట్టిదేనా ?

పచ్చి తంగెడుకట్టె పొయిల వెట్టినట్టు
పరాయోని పల్లవందుకున్నవ్
వరదవై వత్తవనుకుంటె బురదవన్నగాలె
అగడు బెగడు ఎగవడి ఏతులు కొట్టి
వొన వొన వొర్రిచ్చుకోవడ్తివి
సమతల దర్పణమై ప్రతిబింబిస్తావనుకుంటె
కురుసోనివై కుంగిపోతివి ...

పంచుకోవడం వల్ల ఏర్పడేది
సమయోజనీయ బంధం
బంధం బలపడాలంటే కొన్ని కోల్పోవలసిందే
ఓరి అయ్య ... యాదికుంచుకో
అమ్మను మరిచినోడైనా ... మట్టిని మరిచినోడైనా ...
సచ్చినప్పుడు కలవాల్సింది ఈ మట్టిలోనె ...

<u>తేది: 14-05-2010.</u>

## పోరాట బిడ్డలు

దో సిల్లల్ల కాలం బరివాతల
అగాధంలోకి జారిపోతున్న దృశ్యం

మెత్తటి చేతి స్పర్శలు
కత్తి అంచుల కోస్తున్నప్పుడు
ఎదిగొస్తున్న జ్ఞాన బీజాన్ని
పక్కల బల్లెం గుచ్చిన మొఖాన్ని
పండో పండని అమ్ముతున్నప్పుడు

తండ్లాడే శూన్యం బతుకుల్ల
జన్మించిన ఎదురుకాళ్ల పోరాటబిడ్డలు
బారెడు పోరాట రహస్యాలు
కొడిదెడు గుండెల నాటుకొని
ఆకలిగొన్న మెదళ్ల నిండా
ఆవేశాల అగ్గిపూల నింపుకొని
అస్త్రశస్త్రాలు ధరించి యుద్ధంలో
దిగబడుతున్న రథచక్రాల్ని
భుజానికెత్తుకొనే వీరుల్లా కనిపిస్తారు

కాంతి + కాంతి = చీకటిగా మారినపుడు
బొగ్గు పొరల్లో పుట్టిన అగ్గి కణాలు
మబ్బుల చాటు జ్ఞాన రెక్కలకు



నిప్పంటించుకొన్న సూర్యులు
అస్థికలు మాత్రమే వదిలి ఆహుతవుతారు

మరి వారియి ...
అసంకల్పిత ప్రతీకార చర్యలందామా ?
ఆత్మహత్యలందామా .... ?
కాదు ... కాదు ... ప్రభుత్వ హత్యలే !

చైతన్యం శవమై ...
శీల లేని గిరోలె కూలినకాడ ... !
కాల్చి పారేసిన బొక్కలే కదా !
పదునెక్కిన ఆయుధాలయ్యేది !
పలిగిపోయిన డొక్కలే కదా
పాటల దరువయ్యేది !
కొలిమికాడ గుమిగూడిన
సిలుమెత్తిన ఆయుధాలే
సర్పించుకొని సమరంలో నిలబడేది !

పిరికోడు పీడనను సహిస్తూ జీవిస్తాడు ...
వీరుడు ఎదిరిచ్చి జీవిస్తాడు ... !
బిడ్డలూ ...
చావడం కాదు ఎదిరించి
జీవించడం కోసం పోరాడండి !

*వీర తెలంగాణ, సెప్టెంబర్, 2010.*

## నీ అయ్య జాగిరా ?

ముడ్డి మీద ముల్లుగట్టెతోని దండెపోడిత్తె
పొనీతియన్ నావోల్లె అనుకున్న
గుండును పేను గొరిగినట్లు కొరిగితే
అయితేవాయెతియ్ అన్నదమ్ములం
అందరమొక్కతల్లి బిడ్డలమనుకున్న

నా తలగొట్టి పీటేత్తె
గద్దెపొందించిన బేమాన్లు
బొచ్చె తలంలో మర్రిఊడలై దిగవడి
హైద్రాబాదును అర్నమడిగితె
సూదిమొనల వదికి కనుగుడ్ల కొలికిల
కలుక్కున రక్తం ఇంకిపోయింది
దించిపోసిన చంద్ర దీపమోలె
బతుకే గుడ్డంగడయింది
నెరిగీలవడ్డ సూపు
అలుకు పిడిసెల అట్టకట్టింది
తెలంగాణ తల్లి నుదుట రాసిక దుక్కం
గవ్వల కండ్లల్ల నిప్పురవ్వలై సిమ్మింది

పరుల సొమ్ముకు పంచలపొంటికైరత్
పెయ్యంత నరంలేని నాలుకల రాజేంద్రుడు
పాయిరాలగుట్టల్ల తలపండు పలిగిన
నిలువెత్తు అహం



అయినా సేపోయోల్లు సెడనీల్గుతుంద్రు
మా తావులల్ల సర్కారు తుమ్మలై
ఇసుర్కపోయింద్రు
ఎగవడి పాల్దాగి తుంటకొక్కులై బలిసింద్రు
మా నౌకర్లల్ల భూములల్ల
పాములై బుసకొడుతుంద్రు
ఆయువు పట్నంల కాల్లుపాతుకొని
ఎర్రికుక్కల ఎగబెట్ట తెలంగాణను కొల్లగొట్టి
ఫ్రీజోన్‌తో పిస పిస జేత్తంద్రు
అయినా రోకలి దాటని ఆలాపనలా ?
లొట్టిమీని కాకోలె వుట్టి గొర్రుడేనా ?

ల్యాత పేగులు లోతుల వడి
డప్పు సెక్కలైన కడుపుల
తలవంచని తంగెడు పువ్వులు
మొదలారని మోతుకు సెట్లు
దుబ్బక తుత్తుర్ల అగ్గిసెండ్లు
దుల్దుమ్మ దివిటీలు

ముల్కసెట్ల కింద ఇన్నూరు సీమలబాటలు
తప్ప ఎటో తేలేదాకా ?
తెలంగాణ వానయ్య జాగిరా అని
కాకెక్కిన ఇసిరెల అగ్గెలుంచుకొని
ఈసమెత్తు జాగనిడువక
మర్మందెల్సిన మనమట్టి కోసం
మన్ను బుక్కయినా కొట్లాడుదాం.

*జాగో జగావో - సింగడి సంకలనం, తేదీ: 01-11-2009.*

## స్పిరిట్ తగ్గిందా ... !

గోగు పువ్వుల రథ చక్రాలతో నింగికెగిరే
ఆకాశ దీపంలో అమరులు వదిలిన
ఆశయాల స్పిరిట్ తగ్గిందా ఏంది ... ?
ఎందుకట్లా నేలకూలి పోతంది ... ?

ఆమ్లాలకు జల దాహమోలె
నేతలకు పదవీ మోహం ఎక్కువ

భూమి సూర్యుని చుట్టూ తిరగడం ఆగిపోతె
సూర్యుని మీద పడిపోతది అది ప్రకృతి
ప్రజల భావాలు తెలుసుకోని నేత మీద
ప్రజలే పడతరు ఇది వికృతి

గురుత్వాకర్షణ లేని అంతరిక్షంలో
ఏ వస్తువు బరువైనా శూన్యమే
జన బలం లేని లీడర్ ఎక్కడైనా జీరోనే
వాంది కంకిన బొక్కలకాశపడే
ఎంగిలి కంచాల కాడి కుక్కబతుకు

కన్నతల్లి వీరతిలకం దిద్ది పోరుకు పొమ్మంది
తల తెగినా తలవంపులు తేకన్నది
యుద్ధ రంగం నుండి పారిపోయిన
ఆడిగుళ్ల కొడుక్కి ...



నులక మంచం సాటుకు పసుపు ముద్ద పెట్టింది
ఇగ తనివిదీర రక్తంతో తానమాడుకో !

రెండు భిన్న రూపాలున్నా మూలకం ఒక్కటే
వజ్రతేజమోలె వెలుగునిస్తావనుకుంటే
అగ్గినిచ్చే బొగ్గోలెనన్నా మండకపోతివి !
గ్రాఫైట్ లెక్క నున్నగ ఎక్కడికక్కడ
గట్లిరిగిపోతివి బిడ్డా ... !

తరంగ చలనానికి శృంగం ద్రోణులోలె
ఉద్యమానికి వందురు మిత్రలు వుంటయి
శత్రువు కదలికల ధ్వని వేగం
గాలి, నీటిలో కన్నా ఘనపదార్థాల్లో ఎక్కువ
ఘనీభవించిన నా గుండె అంచుల మీద
చెవులు పెట్టి శత్రువు అలికిడి పసిగట్టకపోతివి

ఆలుమగల జగడం అద్దంలో నీడంటవా ... !
ఇది అన్నదమ్ముల లొల్లి గదరా
పక్కోడు గెట్టు చెడగొడితెనే పౌరుషమత్తది
ఇక్కడ బతుకులే చెడిపోయినయి గద !

సూది మొనంత జాగియ్యనందుకే
కురుక్షేత్ర యుద్ధం జరిగింది
ధర్మం గెలిచింది ... అధర్మం ఓడింది

అంగాంగ ఆమ్దాని వున్నోడు
మనల నెగులనియ్యడు ... !
రెటీనాపై ప్రతిబింబం తలకిందులుగా పడినప్పుడు

వస్తువు నిలువుగా కనబడుదు ఎంత నిజమో
వగోనికి ఉద్యమం వంకరగా కనిపించుదు అంతే నిజం

కంటికి కనిపించని లేజర్ కిరణాలు
శరీర అవయవాలను తెగ్గోసినట్టు
తేనె పూసిన కత్తులతో మెత్తగా కోస్తుండు

మంగులం పెంకలోలె ఈపుల మీద
ప్యాలాలేగుతాంటె ... !
మంత్రి పదవులు, మజాలేంది ... ?

మా ఆశల వాహకానివైతవని అంటగడితే
నడుమంత్రాన కాని ఎత్తేత్తివి !
ఆకలి అణిచివేత దోపిడి వున్నకాడ
తిరుగుబాటు రాకపోతె తిప్పలెట్లపోతది

ఆనాడు నేతాజీ ...
నాకు రక్తం ఇవ్వండి మీకు స్వేచ్ఛనిస్తానన్నాడు
నేడు రక్తం ఏరులై పారుతున్నా
నాకు ఓటెయ్యండి ...
కోట్లు సంపాయించుకుంటానంటావా ?
పదవులు బట్టుకొని వేలాడే
నువ్వేంది బిడ్డా నా కడుపుల చెడబుట్టినవు !

వల్లుబండ సంకలనం కరీంనగర్ తెలంగాణ ఉద్యమ కవిత్వం.



## భరోసా!

మాది ప్రాంతీయ మత్తు కాదు
పాంచ్ రాస్తాల కత్తిమొనల మీద
నెత్తుటి మడుగుల గాయాలతో నడుస్తున్న శిరస్సు

గుండె చిల్లులువడి కరకర రక్తం కాల్వలై పారుతాంటె
కుర్చీ మూగదై తుపాకులు గర్జిస్తున్న నేల

హలం-కలం, గళం దమ్ము దీసుకోక
దుమ్ము దుమ్మైె దమ్ము జూపే సమరం

అయ్యా ! ఓ తెలుగోడా !
ఇక్కడ నువ్వు భద్రమే, నీ భాష భద్రమే !
భరోసా లేనిదల్లా మా బతుకులకే !

మూడడుగుల భూమిని దానమిచ్చే అమాయక చక్రవర్తుల జేసి
ఈ నేల యెదను పిండి పచ్చిపుండు జేస్తూ
నరమేధ యాగాలతో సరిహద్దుల్లేని సామ్రాజ్య నిర్మాతలే మా శత్రువులు !

బుడిమెకాయల దొంగంటే భుజాలు పునికి చూసుకున్నట్టు
ఇన్నేండ్ల సందిలేంది ఇప్పుడెట్ల భయంబుట్టె బిడ్డా !
కులం, మతం గాక ప్రేమకు పట్టాభిషేకం గట్టిన షహర్ !
అలయి బలయి దీసి ధూలా ఆడిన జమీన్ !
సొంగరొట్టె, మలీద ముద్దను కలిసి తిని

హిందూ ముస్లింలు ఇరానీ చాయ్‌ను ఇష్టంగా తాగిన నేల
మత సామరస్యానికి మొగులును ముట్టే గోల్కొండ !

పొట్టనెత్తిన వెట్టుకొచ్చిన అన్నార్తులకు
మా యెత్తు, తంగేళ్ళు తలవంచి నీడనిచ్చినయ్
గండిపేట నీళ్ళు నాతో పాటు నీ దూప దీర్చినయ్
నడిబొడ్డున చార్మినార్ నాలుగు చేతులు చాచి దోస్తీ గట్టింది
మక్కా మసీదు పావురాలు మన స్నేహం కోసం దువాజేసినయ్ !

ఆత్మగల్ల హైద్రాబాద్ భూములన్నీ సంకల వెట్టుకుంటివి
కొడిదెడు మట్టిని దీసి ఎప్పుడైనా వొంటికి పూసుకున్నవా !

సేపోయి కొడుకా ! తెలు'గోడ' గట్టి మా దేశ భక్తిని ప్రశ్నిస్తే
మా భూమ్మీద ప్రమాణం జేసి ప్రతిజ్ఞ జేస్తున్నం
భారతదేశం మా మాతృభూమి ! భారతీయులందరు మా సహోదరులు !!
దేహంలో శిరస్సు భాగమే ! దేశంలో ఈ నేల భాగమే !!
నీకు మాకు వేరు ఖాయమే !

మేమెందుకు విడిపోవటానికి శరీరాలు అంటుపెట్టుకొని
సత్యాగ్రహిలమైనం ?
ఆత్మహత్యలనాపి ఆయుధాలు ధరించి సాయుధులం గాలేమా ?
మా మనసు లోతుల్లోకి వేలుపెట్టి కెలికితే
వెన్నతడి ఊటలూరే కన్నతల్లి గన్నది.

తేది: 17-04-2011.



## కుంపటి

కిర్రు జెంగల్ల ఆకురాలిన చెట్టుకొమ్మ
పిడాత తల వంచుకుని దుక్కిస్తు
మనుసు బిర-బిర-చేదుకుంట
ఈ నేల మీది కీచులాటను... దొరింపు జేసుకుంటంది

కండ్లు పోయి కనగంతల పడి
అరియలై ఎర్రని కాయలు గాసి
వొంటికన్ను అవుస్తున్న కన్నీటి చుక్కలు
కొంగుకు వడిగట్టి కొడవలి లిక్కులై
బిగిసిన గుండెల్ల ఎగిసిపడే నిరసనలు
మా గుండెల మీద అలంకరించుకోవటానికి
'గులాభి పువ్వులేమి కాదు, కండ్లల్ల గుచ్చుకునే ముండ్లు'

ప్రియమైన నా సోదరుడా !
ఉద్భేదనం చెందిన అగ్నిపర్వత అభికేంద్రాన్ని
అభ్యర్థనలు, హర్తాళ్ళతో ఆర్పివేయగలమా ?

పచ్చని మా కలలన్నీ తీపి బాణాల విషపు దెబ్బలకు
విచ్ఛిన్నమై జల-జల రాలిపోయిన అవిటి పావురాలు

ఇర్రు-ఇర్రు మంట పొట్టనిండ ...
మినుకు-మినుకు మంటు... చీకట్లో
గడ్డిపోచమీదికెల్లి జారిపోయే ప్రాణాలు

దుక్నాన్ని గుర్తించవు ! కన్నీళ్ళను తుడిసేయవ్:
పుండు మీద కారం చల్లి - పూకె, పూకె కెలుకుతుంటవ్
ఇల్లు కాలి మే మేడిస్తే - నాలుక కొవ్వి నకరాల్ జేస్తవ్

మా నేల మీద మేము పరాయి వాళ్ళమైనపుడు
నడింట్ల నీ పెత్తనపు గోరీలు కట్టి - మా త్యాగాలను గేలి చేసి
ఉనికిని, ఆత్మగౌరవాన్ని దెబ్బ తీసిన కాడ
త్యాగం ఇప్పుడు సహజమైన సందర్భం
బర బర మండే నిప్పుల గుండం
కుర్రు మీది తుప్పు రాలి ఖడ్గమైన దినం
తుర్రు తుర్రున ఎగిరిపోయే పావురాల
గుండెల మీది నిప్పుల కుంపటి ఒక్క పోటుతో
అవలీలగ... అలల కింద ఒదిగిపోయి
హుస్సేన్ సాగర్ బుద్ధుని పాదాల కింద
ప్రాయశ్చిత్తం చేసుకుంది

అన్నా ! ... అగాయి-బగాయిల ...
మన నడుమ గెట్టుపెట్టేకాడ అడ్డస్తే ...
చెట్టును కూడ కాటు పెడ్తం.

*దిమ్మిస కవితాసంకలనం : తేది: 10-03-2011.*



## తలవన్నెల ఎలుగు

లోకమంత గండ గుర్రుల గాఢనిద్ర
తలవన్నెల ఎలుగులు పోరాడి అలసినయి
సందమామ అవిటిదై నల్ల తెప్పల నక్కింది
గుడ్లగూబ గూయది సిమ్మట్లు పల్కయి
చెట్లకొమ్మలకు ఆకులుండయి
చెరువుల్ల నీళ్ళుండయి
కన్నతల్లి రొమ్ములు పిండినా పసిపాపకు పాలెల్లయి
మనుషులంతా వలసపోయి కటిక కురులీర బోసుకున్న కాలం
ఎగిడ్సిన వలసవాది అగిర్తలేసిన అంగమయిండు
న్యాలతల్లి నెత్తిన మేకులు దిగ్గొట్టి మెడకు సమైక్యపు ఉరి బిగించి

పులిసిన ఆకలి కడుపుల్ల నాయినొప్పి
దిమ్మదిరిగి తిమ్మిరెక్కిన ఆత్మగౌరవం
గాయాల గండ్లతో గడ్డకట్టిన
గుండె దిగుడులో మొకం పెట్టింది
ఎవలుల్లా! వాళ్ళు?
ప్రాంతీయ అసమానతలపై పరిశోధన చేస్తుండు
న్యాల మూల్గుల రగుతం మరిగించి
స్రవించిన చమటనంతా సొంచాల్లోనింపి
ఆలోచన ఆయుధాల పోరాట రథ ఇరుసులను నిర్మిస్తుండు

వొంటరి దుక్కపు మిణుగుర్ల నుంచి
చిక్కపడ్డ అక్షరమై సిద్ధాంతాన్ని అధ్యాపిస్తుండు...

మనుషుల ఆధార భారం మట్టివైపే
ఇచ్చుకపోయిన మట్టి సప్నాల్ని
న్యాలతల్లి ఎండిన నయనాలనుండి
ఎక్కస్తున్న సోకాన్ని ఎదలకద్దుకున్నడు
స్వయంపాలన హక్కుల సాధనకు
విల్లెక్కుపెట్టి లక్ష్యసాధనకు లంఘించుమన్నడు
పొట్టకూటికి వచ్చినోళ్ళతో కాదు
పొట్టకొట్టే వాళ్ళతోనే పోరాటమన్నడు
ఊర్లెల్ల ఉద్యమ స్ఫూర్తి నింపి
ఆత్మసమ్మాన జండానెత్తి
జై తెలంగాణ పోరు రథాన్ని వదిలి
ఎఱ్రజీరల ఎళ్ళిపోయిండు
ఇగ....
తల్లితోడు తెగాయించుడే
తెలంగాణ వచ్చేదాక లగాయించుడే

ప్రొ॥జయశంకర్ గారికి నివాళి... నమస్తే తెలంగాణ 23 జూన్, 2011